పలు చెల్లాచెదరై నశించె నహహా! ప్రారబ్ధకర్మమ్మునన్
గలిగెం బో యొక గాలివాన భువనోత్కంపమ్ము సంధిల్లఁగన్.

—• పరస్త్రీగమనమువలని నష్టము. మాలినీవృత్తమ్ •—

పరసరసిజనేత్రా సంగమార్థం యియాసో
ర్భవతి చరణరక్షాతాడనం తత్ర తత్ర
అపితు చికురహానిః ప్రాణహాని స్తథైవ
ప్రభవతి ఋత మేత న్మానహానిః కదాపి.

—• యౌ వ నా వ స్థ •—

చ సుకృతపు బుద్ధి మూలఁబడు సుందరియే గురువంచుఁ దోఁచు దు
ష్టకృతులె యాగమమ్ములగు జావళులే నయబోధకమ్ములౌ
నకటకటా! యొకానొకని కగ్గలమై తగు జవ్వనంబునం;
దొకనికి బుద్ధిమార్పడకయుండుఁ బురాకృతపుణ్యసంపదన్.

—• జ రా వ స్థ •—

ఉ. చూచినయంతమాత్రమున సుందరులెల్ల హసింత్రు. పిల్లలున్
గోఁచినిఁ బట్టి లాగుదురు, కొందఱు "తాత" యటంచుఁ గేరి దో
బూచులఁ నాడఁ బూనుదురు వో! జర మూఁడినమీఁద నక్కటా!
యేచవి గానుపింపదు వఱెయ్యదియున్ సుఖ మీయ దేరికిన్.

—• అకాలవర్షమ్మునందు రాత్రి వీధిపంచను పరున్న మార్గస్థుఁడు •—

సీ. తనయింట నున్న వెచ్చనిశయ్య పలుమాఱు
మానసమ్మునను సంస్మరణచేసి
తనయింట నున్నగుత్తపుగుబ్బలాఁడి మే
ల్గిలిగింతలను మాటికిని స్మరించి
తనయింట నున్న చక్కనిపచ్చడమ్ములఁ
బలుమాఱు మనమునఁ బలవరించి
తనయింట నున్న మెత్తనికోట్లతండమ్ము
లేల తేలేదని యెంచి యెంచి

తే. గీ. కడుపులోఁ గాళ్ళు నిఱికించి గడగడగడ
వణఁకుచును నిదురపోసాగెఁ బాంథుఁ డొకఁడు
వానతుంపురు లొకకొన్ని మేనఁ బడఁగ
గాలి దగిలెడి యొక పంచపాళిలోన.

—• జగన్మోహిన్యవతారము •—

సీ. అమృతంబుపేరు దైవ మెఱుంగుఁగాని యీ
యనుపమాకృతి చూత మనెడివారు
చూచుటకేమి యీ సుందరీరత్నమ్ము
నటు చననీకుఁడీ యనెడివారు
అక్లేల పోవు నాయందుఁ దాత్పర్య మీ
యంగన సూచించె ననెడివారు
నీయందు సూచించెనే? కాదుకాదు నా
యందున సూచించె ననెడివారు

తే. గీ. వైరి రక్కసులెల్ల మోహాబ్ధిమగ్ను
లగుచు శ్రీమజ్జగన్మోహనావతారుఁ
జూచి యంతియ కాని శ్రీశుండు మోస
గాఁ డటంచును మది నెఱుంగ రకటకట!

—• ప్రబోధచంద్రోదయములోని "లభ్యం లబ్ధ" మను శ్లోకమునకు
తి॥ శా॥ చెప్పిన తెలుఁగు •—

చ. "ఇది లభియించె నింక లభియించు లభించినదాని వడ్డిచే
నవనము నేతు" నంచు మదియందు సదాధనముం జపించు నీ
కిది తెలియంగ లే దకట! హెచ్చిన యాశ పిశాచిరీతి నీ
కుదురు నశింపఁజేయుఁజుమి కూఁకటిదుంపలతోడ మూర్ఖుఁడా!

ఉ. చేకుఱెఁ జేకుఱం గలదు చేకుఱినట్టిధనంబు పెంచినన్
జేకుఱు నింతకన్నను విశేషముగా ధనమంచు లోభమున్

జేకొని యున్న నిన్ను నతిశీఘ్రముగా నొక పెట్ట మ్రింగఁగా
నాఁకొనియున్న దయ్య మని యాళ నెఱుంగ వదేమి ? మూర్ఖుఁడా !
వెం॥ శా॥ చెప్పినది.

15. దుర్ముఖి సం॥ ఆషాఢమాసములో మొగల్తుర్తికోఁటలో జర
గిన శతావధానములోఁ జెప్పిన 50 పద్యములలోఁగొన్ని.

—• ప్రకృత ప్రభువు •—

క. శీలమ్మున వంశమ్మున
నాలాపమ్మునను మేల్ నయమ్మునను మఱే
రీ ? లోకమ్మున నృపతులు
శ్రీలక్ష్మీనారసింహనృపవరుఁ బోలన్.

—• ఆంజనేయులు •—

సీ. దాఁటె నెవ్వాఁడు ప్రోద్దామవేగాటోప
మున గోష్పదమ్ముగా మున్నువార్ధి
మీటె నెవ్వాఁడు గంభీరరాక్షసరాజ
కులమెల్లఁ దనకొనగోటిచేత
దూటె నెవ్వాఁడు బంధురతరాగ్నిజ్వాల
గల తోఁకతో లంకఁగల గృహముల
నాటె నెవ్వాఁడు విన్నాణంపుజయపుఁగం
బంబు లంకాపట్టణంబులోన

తే. గీ. నతఁడు గుణవంతుఁ డతిశాంతుఁ డరికృతాంతుఁ
డమలసుస్వాంతుఁ డనుపమానంతకాంతి
మంతుఁ డతిమంతు భక్తదుర్మంతుహరణ
వంతుఁ డలరారు శ్రీహనుమంతుఁ డెలమి.

—• "కోశద్వంద్వ మియం దధాతి" యను శ్లోకమునకుఁ దెలుఁగు •—

చ. "నళిని ధరించె నంచ ముకు నాటిన మొగ్గలు రెండు, చూడు చూ
తలత ధరించెఁ బుంస్పికవిదారితమౌ నవపల్లవంబు నె

చ్చెలి! గనుఁగొంటివే?" యని వచించు చెలిం గని దీర్ఘికాతటిన్
గలికి కుచాధరోష్ఠములు గప్పికొనెన్ బయఁటన్ గరమ్మునన్.

—• వీరేశలింగముగారు చేయు విధవా వివాహములను గుఱించి •—

సీ. "మాడబ్బుచెడఁద్రొబ్బెమాప్పబుద్ధుఁ" డటంచు
మంగలివాండ్లు తన్నుం గుణింప
పెండ్లములకు వండిపెట్టఁగా సుఖియించు
వారలెల్లరు తన్ను దూఱుచుండ
విద్యార్థులును మెట్టవేదాంతులును గూడి
తన్ను నేవేళ నిందను నొనర్ప
"మును చచ్చినట్టి మగనితద్దినం బెట్టు?"
లని బుధవరులు వాదొనరఁజేయ

తే. గీ. నన్నిటికి నోర్చి విధవలౌ నంగనలకు
"భ్రూణహత్యలు జరగక పోవుఁగాక"
యంచుఁ బెండిండ్లు నేయ యత్నించుచుండెఁ
గందుకూరి వీరేశలింగప్రధాని.

—• ప్రకృతప్రభువు. (మందాక్రాంతావృత్తమ్.) •—

స్మేరం వక్త్రం హృదయ మమలం శీతలా చ ప్రవృత్తి
రూపం తాపాపహా మమృతవాగ్వారణీ ధోరణీ చ
తుష్టి స్తుష్టా బహు వితరణం పుష్టి రత్యంతపుష్టా
జాగర్తి శ్రీకలితనిలయే నారసింహక్షితీంద్రే.

—• రాజు తమ్ముఁడు •—

శా. సారాసారవివేకయుక్తుఁడు యశస్సంపాదనాత్యంతశో
భారోచిష్ణుఁడు రూపవంతుఁడు కళాభ్రాజిష్ణుఁ డత్యున్నతా
గారారామవిశేషభాసురుఁడు శృంగారప్రధానుండు సు
శ్రీరమ్యుండు కరమ్ముఁ జెన్నలరు లక్ష్మీకాంతరా జెల్లెడన్.

—• మన్మథుఁడు •—

క. కలకులకన్గొన లను న
మ్ములఁగొని విటరాజహృదయముల్ పగులఁగ గా
సిఁజేయుచు మాయఁడు తొ
య్యలులకు దాసానుదాసుఁడై చరియించున్.

—• రామాయణము •—

తే. గీ. శివునివిల్ ద్రుంచి జనకునిచెల్మిగాంచి
సీతఁ బెండ్లాడి వనికి వేంచేసి పిదప
రావణునిఁ దున్మి శ్రీరఘురాముఁ డతిప
తోడఁ బట్టాభిషిక్తుఁడై నాఁడు నాఁడు.

—• నలచరిత్ర •—

చ. నలుఁ డల యంచకారణమునన్ దమయంతినిఁ బెండ్లియాడి, పె
న్గలుముల నంది, జూదమునఁ గాఁగలకార్యము లొంది, మీఁదఁ గా
నలఁ బలుకష్టముల్ వడి, యనంతర మా ఋతుపర్ణుఁ జేరి, వే
డ్కలు చెలువార నాపయి సుఖమ్మున నుండెను దానుఁ బత్నియున్.

—• సోమరితనము •—

ఆ. వె. చదువు మట్టుపడును సంస్కృతి చెడిపోవు
సంపదలు తొలంగు సౌఖ్య ముడుగు
గౌరవంబుపోవుఁ, గావున సోమరి
తనముకన్న హీనదశయుఁ గలదె!

—• వైష్ణవులు స్మార్తులు •—

సీ. శివునియాఖ్యానమ్ము చెవిసోకినంతన
నిప్పుత్రొక్కిన కోఁతినియతిఁ గాంతురి
శివు నాలయంబు కన్గవఁదాకినంతన
గాలిసోకినరీతిగాఁ జరింతురి
శివదేవుఁ డూరేగునవసరమ్మునఁ దల్పు
మూసిపెట్టుక యొక్కమూల నుందురి

వెలిబూదె నొసఁటను బెట్టువారలఁ జూచి
పకపకనగుచుఁ జప్పట్లుచరతు

తే. గీ. రహహ, యేమందు వైష్ణవులైనవారి
చర్యలను: శివకేశవ స్వాములందు
స్మార్తులగువారు సమభక్తిసలుపుచుందు,
రదియ న్యాయ్యం బటంచు మా కభిమతంబు.

16. దుర్ముఖి సం॥ ఆశ్వయుజకార్తీకములలో రెండవసారి కాకినాడలో జరగిన యనేకావధానములలోఁ గొన్నిపద్యములు.

—• (సమస్య) మాకులదాస : యెంత యభిమానము లేదుర చంద్రశేఖరా ? •—

ఉ. "నాకు విభూతిరాయఁ డొకనాయకుఁడా" యని నీదుభార్య ర
త్నాకరుచెట్టపట్టు టది యారసి యుండియు, సిగ్గు లేక ర
త్నాకరుఁ జంకఁ బెట్టికొని యక్కటలటన్ దలఁ దాల్చితౌర : భా
మాకులదాస : యెంత యభిమానము లేదుర : చంద్రశేఖరా :

—• యః కౌమారహరః" అనుశ్లోకమునకు తెలుఁగు •—

సీ. చిన్నారిపొన్నారిచిఱుతప్రాయముచూఱఁ
గొన్నవాఁడె ప్రియుండు కోమలాంగి
తఱపివెన్నెలలతో నొఱపు గల్గిననాఁటి
చైత్రరాత్రులె కదా : సరసిజాక్షి
మాలతీపరిమళవ్యాలోలములు నాఁటి
నీపవాయువులెకా : నీరజాస్య
తలఁపులొక్కటిగాఁగఁగలసికుల్కిననాఁటి
దాననేకద : యేనుఁ దలిరుఁబోఁడి

తే. గీ. నాఁటిసురతప్రసంగమే బోటిమిన్న
యైన నామన మదియేమొ కావి మేటి
నాఁటి రేవానదీతీరవాటి నొప్పు
వేతసీతరుమూలమ్ము వెదకఁబోవు.

ఈపద్యములో రెండుచరణములన్నరవఱకును సమస్యగా నీఁబడెను.

సీ. (నిలువుటద్దమెదుట నిలిపిచూపితిఁగాని
పలుకె పు లేమని పలికినాన!
పసమీఱుదుప్పటి పైనిఁ గప్పితిఁ గాని
పసపురం గేమని పలికినాన!
విరులసురటిదెచ్చి విసరుచుంటినిగాని)
చెమ టదేమని పృచ్ఛచేసినాన!
పవళింప విరిపాన్పుసవరించితిని గాని
యాయాస మేమని యడిగినాన!

తే. గీ. మొగము వెలవెలఁ బోయిన మూలమేమి?
యెఱుపు గనులందుఁ గల్గినహేతువేమి?
నాథ! నాయందు లోపమున్నను క్షమింపఁ
బాడి యగుఁగాక తప్పులు పట్టఁ దగునె?

—• (సమస్య) రండల దర్శింపఁగోరు రాజులమనముల్ •—

క. పండితవాక్యశ్రవణము
దండుగఁగానెంచి దానఁ దగులుకొనవుచో
కుండలు గడిగెడు దాస్యపు
రండలదర్శింపఁగోరురాజులమనముల్.

—• (సమస్య) ఒడ్డాణ మలంకరించె నువిదకుచంబుల్ •—

క. అడ్డమయినట్టివిటులకు
బిడ్డలఁగని బిరుసుదక్కి బింకముచెడి యా
బిడ్డలు పాలకు నీడ్వఁగ
నొడ్డాణ మలంకరించె నువిదకుచంబుల్.

—• వాడకట్టు బుల్లిరాజు జాతకమునుగూర్చి •—

మ. శనిమూటన్ శశిరెంట భార్గవబుధుల్ షష్ఠంబునన్ సప్తమం
బున రాహూష్ణకరుల్ పదింట గురుఁడున్ భూపుత్రుఁడున్ ద్వాదశ

మ్మున నొప్పారఁగ వృశ్చికంబునను దాఁ బుట్టెన్ దగ న్వాడక
ట్టనువంశమ్మున బుల్లిరాజు తనయుండై కామమాంబాఖ్యకున్.

17. దుర్ముఖి సం॥ మార్గశీర్షములో పిఠాపురములో వాడ్రేవు వారింట జరగిన యవధానములోఁ జెప్పిన 70 కిఁ గొన్ని పద్యములు.

—• పార్థసారథి. (పృథ్వీవృత్తమ్) •—

కశాం కరతలే వహ న్నపిచ చోదయ న్సత్వరం
తురంగమచయం జయం సహకిరీటినా ప్రస్తువన్
రణేఽతనుత సారథిత్వకృతి మాదరా ద్యః పుమాన్
స మా మవతు దేవకీరచితపూర్వపుణ్యోదయః.

—• చర్లబ్రహ్మయశాస్త్రులుగారు •—

సీ. బాల్యమ్ములోనన పండితుల్ మెచ్చంగ
నఖిలవిద్యలు కాశి నభ్యసించెఁ
దరువాత దేశాన కరుదెంచి ధవళేశ్వ
రమ్మున నన్నసత్రమ్ము వెట్టె
నిదిగాక విద్యార్థు లెందఱినో పండి
తులఁ జేసి దాన సంస్తుతులు గనియె
నది యట్టులుండ దరిద్రములేని తనశిష్యు
లెందఱికేనిఁ బెండ్లిడ్లుచేసె

తే. గీ. "పొట్ట పోషించికొనియెడి బుధులు పెక్కు
కలరు, గాని జగమ్మునఁ గలరె యిట్టి
పండితు" లటంచు నుతియింపఁ బ్రబలె నౌర!
చర్లవంశ్యుండు బ్రహ్మయశాస్త్రి ఘనుఁడు.

—• రామపట్టాభిషేకము. (ప్రహర్షిణీవృత్తమ్) •—

మోదద్భి ర్మునిభి రపి ప్రహృష్టచిత్తై
స్సుగ్రీవప్రభృతిభి రుత్తమైః కపీశైః
యుక్త శ్శ్రీరఘుకులనాయక స్సభార్యో
రాజ్యశ్రీవిలసితపీఠ మారురోహ.

—• తిరుపతివేంకటేశ్వరుఁడు •—

సీ. కాచినాఁడవుకదా కరిరాజుప్రాణమ్ము
కఠినసక్రమును జక్రమునఁద్రుంచి
ప్రోచినాఁడవుకదా పూర్వదైత్యేయడిం
భకుని వేవేగఁగంబమునఁబొడమి
దాచినాఁడవుకదా ద్రౌపదీమానమ్ము
సభలోనఁ బెక్కువస్త్రమ్ము లొసఁగి
చూచినాఁడవుకదా సోదరున్ విడనాడి
శరణుచొచ్చిన విభీషణునిఁ బ్రీతి

తే. గీ. ననుచు నినుఁ జేరినార మత్యాశచేత
మమ్ము రక్షించు టెంత యమ్మక్క! నీకు
సరసతిరుపతివేంకటేశ్వరకవీంద్ర
శరణ తిరుపతివేంకటేశ్వర! నమోస్తు.

—• కుంతీమాధవుఁడు •—

మ. స్థిరభక్తిన్నుతియింతు నెమ్మదినిఁ గుంతీమాధవున్ శ్రీధవున్
జరణద్వంద్వమునన్ శిరం బునిచి వేసారుల్ నతుల్ సల్పుచున్
గరుణాసాగర, కావవే! నను జగత్కల్యాణ! రక్షింపవే
పరమోదార యనుగ్రహింపు మనుచున్ బల్మారువాక్రుచ్చుచున్.

—• అమర, భ్రమర, సమర, కొమర అనుపదములతో మధుకైటభయుద్ధము •—

చ. కొమర రణరంగ నెంతయును గోర్కెఁ దలిర్ప మనోజసంగర
భ్రమ రహిమీఱ రక్కసులు పద్మదళాక్షునితోడఁజేయ నా
సమరము మాని దేవిని వెసన్ గొన నెంచి పరాంబమోముపై
నమర నిగుడ్పసాగిరి కటాక్షములన్ జెలరేగి మాటికిన్.

—• యౌవనప్రాదుర్భావము (శార్దూలవిక్రీడితమ్) •—

వక్షోజౌ లికుచోపమౌ ప్రతిపదం వృద్ధ్యున్ముఖౌ దృష్టయ
స్సారంసార మధీయతే ప్రతికలం చారుత్వవక్రత్వయోః

మధ్యం కార్శ్య ముపైతి గచ్ఛతి గతి ర్మాంద్యం విలాసోదయా
నావిందంతి వచాంసి నీరజదృశ స్తారుణ్యాబాల్యాంతరే.

—• విప్రలంభము (మందాక్రాంతావృత్తమ్) •—

తౌ వక్షోజౌ తదపి వదనం తాదృశౌ దృష్టిపాతా
స్తద్వై యానం సచ కచభర స్తాదృశ శ్శ్రోణిభారః
ఇత్యంగానా మనుకల మపి స్ఫూర్తి మాలోకమానః
కాలం నిన్యే ప్రియసహచరీవిప్రయోగేణ కశ్చిత్.

— రంభారావణసంవాదము •—

చ. పలికితి వీవు 'కోడలను బట్టకు న'న్నని, వారకాంతకున్
గలుగునె యిట్టిభేదములు ? గన్గొను, తండ్రియుఁ బుత్రుఁడున్ గ్రమ
మ్మలరఁగఁ గూడి యొక్కనదియందునఁ గ్రుంకుట లేదె! యేల యీ
చల, మధరామృతం బిపు డొసంగి ననున్ దయఁ జూడు కోమలీ!

—• కుమారలింగేశ్వరుఁడు (ప్రహర్షిణీవృత్తమ్) •—

భక్తానా మభిమతదాయినం మహాంతం
ధ్యాయామో మనసి సదా కుమారలింగం
నీరేజాసనముఖదేవతావతంసా
యన్నామ ప్రతికల మాదరా జ్జపంతి.

—• పరకీయావిషయికయోజన •—

మ. మితికాలం బరుదెంచునే! చెలియు నా మేలెంచి కీలెంచునే!
ధృతి పూనన్ సమకట్టునే! యితరసందేహంబు పోకార్చునే!
క్షితి గ్రామాంతర మేగునే! యితరనిర్బంధమ్ము లేకుండునే!
కుతుకమ్ముల్ నెఱవేఱునే! ప్రియసఖా ! కోర్కుల్ తుదల్ముట్టునే!

—• ప్రసంగవశమునఁ జెప్పినది •—

చ. ఇతరకవుల్ ప్రయాసపడి యెంచి రచించిననూటి కెన్ని పె
ద్దతనముగాంచి చిత్తమునుదన్పునొ, మే మవధానసంగత
స్థితిగవి యాశుగా రచనచేసినపద్యములందుఁ జూచినన్
శతమున కన్నిపద్యములు చక్కఁగనుండు నసంశయమ్ముగన్.

18. హేవిలంబి సం॥ చైత్రమాసములో గుంటూరులో జరగిన యవధానములోని 30 పద్యములలోఁ గొన్నిపద్యములు,

—• ఆంజనేయువిచర్య. వీరరసము •—

శా. అక్షుం జంపి తదీయవక్షమునఁ బ్రోద్యద్రక్తధవిస్తారసం
రూక్షక్షిప్రభ నొప్పి యెంతయును బోరుం గోరి పైవచ్చు నా
రక్షస్సైన్యమునెల్ల మాపి తను వీరవ్రాతముల్ మెచ్చ బల్
దక్షుండై దశకంధరాత్మజుని మోహిలన్నిల్చెఁ గీశేశుఁడున్.

—• శరత్కాలచంద్రికలో నౌకావిహారము (వసంతతిలకావృత్తం) •—

నౌకాం గతస్య మనుజస్య శరత్క్షపాయాం
గాఢాంధకారయుజి వేగవతీప్రవాహే
బింబీభవద్విమలసద్గణపంక్తిరాసీ
ద్దృష్టిస్తు వజ్రశకలస్య సమానకాంతిః

— గద్య —

ఇది శ్రీ.... కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకళానిధి బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వర కృతంబగు శతావధానసారమ్మునఁ బూర్వార్ధము.

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# శతావధానసారము

## (ఉత్తరార్ధము.)

19. విలంబి సం॥ ఆశ్వయుజములో కిర్లంపూడి జమీందారు శ్రీ యినుగంటి చిన్నారావుగారుచేయించిన యష్టావధానములోఁగొన్ని.

—• రత్యంతమునందు స్త్రీలమార్పు •—

ఆ. వె. కనులు వింతలై నకళలను వర్షించు
మేన మిగులఁ గ్రొత్త మేల్మి దోఁచు
నూర్పు లినుమడించు నుష్ణత గన్పట్టు
నంగనలకు నిధువనాంతమందు.

—• (సమస్య) గణచతుర్థినాఁడు ఫణిచతుర్థి •—

ఆ. వె. "ఎన్నిదినములాయె నిట నన్ను డించి నీ
వరిగి" యనినఁ బత్నికనియె భర్త
"నేఁటి కెన్నఁగఁ బదినెల లాయెఁగా ః నేఁడు
గణచతుర్థి; నాఁడు ఫణిచతుర్థి."

—• పరికృత ప్రభువు •—

సీ. ఏవేళఁ జూచినఁ బ్రావీణ్య మలరారు
కవులతోఁ గాలమ్ము గడపువాఁడు
ఎపుడు చూచినను నింపెసలారుమందస్మి
తంబు వక్త్రంబునఁ దనరువాఁడు
దారిద్ర్యబాధ నెంతయును జిక్కెడివారి
పైఁ గరుణాదృష్టి వఱపువాఁడు
ఎన్నిసార్లడిగిన నిచ్చుటయేకాని
లేదు పొమ్మనుమాట లేనివాఁడు

లా; నది యట్లుగాక యిటులైనను వేఁ జెప్పనున్నదే?
లేనిది లేక యుండ నకిలేమలు నవ్వుటయుం దటస్థమౌ. 85

క. ఇటుఁ గుటిలాలక మనమున
గుటగుట మను, మూరు దూఱుఁ గువలయమిత్రుం
జెటిలి పడఁదిట్టు, నసలసు
గటకట మని వంష్లు గొంతికి కసరు విసువువే. 86

తే. గీ. యామినీగోపకామిని యాకసం బ
నెడిఘటమ్మున జ్యోత్స్న యనియెడి పెరుఁగు
దరచి చేర్చినవెన్నముద్ద యన నంత
వెడలెఁ దెల్లనికాంతితో వేగుఁజుక్క. 87

సీ. ఏచరణాయుధం బింపు మీఱఁగఁ బాణి
 ని యతికి హ్రస్వాదినియతిఁ దెల్పె
నేచరణాయుధం బాచారివిప్రుని
 త్యస్నానదై వజ్ఞతను వహించె
నేచరణాయుధపారిచర్యరూపుఁ డై
 హరి నిశీధము వేకు వనఁగఁ జేసె
నేచరణాయుధశ్రీచేత శూలి పి
 తాపురమ్మున నుండెఁ గాఁపురమ్ము

తే. గీ. అట్టిచరణాయుధసమాజ మఖిలజార
చోరులకు గుండెలో దిగుల్ బోరుకలఁగ
ఉఉఉఊఊ యటంచు నత్యుచ్చరీతిఁ
గూయసాఁగెను దమతమ గూళ్ళనుండి. 88

సీ. జాఱిపోయిన నీవి సవరించి సవరించి
 కులుకుగుబ్బల పైకఁ గుదురుపఱచి
వీడిపోయిన కొప్పు బిగువుగా ముడివైచి
 సొగసుదుప్పటి మేల్ముసుంగు వెట్టి

చెలికానితోడను జెప్పలేకే చెప్పి
మోహమ్మున మఱొక్క ముద్దువెట్టి
చనరేక యొకకొంత సాఁగి వెన్కకుఁజూచి
మనములోఁ గాఠిన్యమును వహించి

తే. గీ. సంతసం బొక్కవైపు విచార మొక్క
వైపుఁ బెనఁగొన 'పీలాటిపనుల నోస
రింపఁగా వలె' నని నక్క తేలకాయ
రీతిఁ గని చనె జారనారీజనంబు. 89

చ. చనుటకు నుద్యమించుఁ, "జన శక్యముగా" దని పవ్వళించు, మిం
చినతమిఁ గౌఁగిలించు చెలిచేతుల దూరముగాఁగ నుంచుఁ, జ
య్యనఁ దలవంచు, నుస్సురని యాత్మవిచారమునందు ముంచుఁ దా
వనితను బాయునప్పు డొక పల్లవుఁ డుల్లము తల్లడిల్లఁగన్. 90

చ. వలపు దలిర్పఁగాఁ బ్రియునివక్షమునం బవళించి నిద్రచే
నలసత గానుపింప వెలయాండ్రు కలల్ గులుకంగ మేలుకొ
ల్పులఁ దగఁ బాడఁగా నిదురపూనికతో విరుపూనిలేచి సం
దులఁ గడుగోప్యమై తనరుత్రోవలఁ బోయిరి చాటుపల్లవుల్. 91

తే. గీ. లేపి పల్లవులను బంపి, లేఁతప్రాయ
మలరు తమకన్నియలఁగూడ మేలఁకువఁగనఁ
జేసి వీణియశ్రుతిఁ జేసి చెప్పఁదొడఁగి
రపుడు గీతమ్ములను వృద్ధలౌ గణికలు. 92

సీ. కించిద్వికసదబ్జచంచదంచచ్చంచ
రీకదంపతుల సస్పృహలఁ జేసి
సమరతావధిఁ బృథక్ఛయ్యాస్వపద్దంప
తుల నొక్కశయ్యపైఁ గలయఁ గూర్చి
యుపరతక్రీడామహోత్సవాలసకామి
నీకుచస్థలఘర్మనీర ముడిపి

సంకేతితస్థలస్థనవప్రసవతల్ప
గరవతీమశముతోఁ గలసి మెలసి

తే. గీ. అమితతృష్ణార్దితభుజంగసముదయప్ర
మదవిధానాతికుశలసంపదలఁ బొసఁగి
మలయనిలయపటీరప్రవలయనిలయ
మారుతములు ప్రభాతసంపదలఁ దెలిపె. 93

తే. గీ. క్తృదుద్యానవనఫలతతులు మెసవి
యినుఁడు రాఁ జోవుచున్నవాఁ డనియెఱింగి,
పరువుపరువున నన్నియుఁ బక్షిగట్టి
తమతమ నివాసములకు ఘూకములు సేరె. 94

తే. గీ. క్రమముగా జాఱె రాత్రి, సరస్తుబప్రి
దేశములఁ జేరి తెల్లవై దికవతంసు,
లరుగఁజొచ్చిరి పాంథులు దురముదసరఁ
దారక లడంగెఁ, జంద్రుఁ డస్తరుచియయ్యెఁ. 95

సీ. పద్మినీవిరచితాపారపుణ్యోదయం
బుత్పలిన్యాప్తపాపోచ్చయంబు
కోకీప్రియాగమాస్తోక ముహూర్తంబు
ఘనహిమానికిఁ బెద్దకారుమెకము
సురతసంతోషవిస్ఫురణమ్మునకు క్షామ
మతనుతాపమ్మున కౌషధంబు
ఆవాలముల వన్ను లార్జించుకరణమ్ము
చీఁకటిపాలిటి చీఁడపురువు
తే. గీ. భువనజాతంబు లేయెడఁ బ్రోచుపోఁడ,
మూఁడుమూర్తులు నివసించు మేడ, జగము
పాలిటి సులోచనం, బహర్పతి క్రమమ్ము
గా నుదయమందెఁ గన్నులకఱవు దీఱ. 96

శా. స్నానంబుల్ పచరించువారు జపముల్ సంధించువా రగ్నిస
మ్మానంబుల్ నెఱవేర్చువారుఁ దరణిం బ్రార్థించువా రాత్మని
ధ్యానంబుల్ పొసఁగించువారు నిగమధ్వానమ్ములం జేయువా
రానందాబ్ధినిఁ దేలువారలును నై రప్డెల్లరున్ వైదికుల్. 97

శా. ప్రాతఃకృత్యములన్ యథోచితముగాఁ బాటించి పొత్తమ్ములన్
జేతం బూని నవీనపాఠమును నిశ్శేషమ్ముగాఁ జూచి తా
మా తాత్పర్యము గొంత కొంత మదిలో నానించి విద్యార్థు లెం
తో తాత్పర్యముతోడ దేశికులఁ గన్గోఁ బోయి రప్పట్టునన్. 98

క. మౌద్గల్యసగోత్రభవా!
సాద్గుణ్యవిచార! ధనదసమధికవిభవా!
హృద్గతభవా! సుకవితా
విద్గణ్యప్రాభవా! ప్రవీణాగ్రభవా! 99

క. గణనాతీతగుణశ్రీ
చణ! కవితారమణ! సరససాహిత్యరణో
ల్బణ! చరణాయుధరూప
త్రిణయన పదసేవనాధురీణ ధురీణా! 100

స్రగ్విణి. కామమాఁబాలసద్గర్భపేటీమణీ
దామముక్తామణీ! ధామభాస్వన్మణీ!
సోమధామోపలస్యూతసౌధాంతరా
రామరాజాధిక ప్రాజ్యభాగ్యోదయా! 101

— గద్య —

ఇది....శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన
కేవలకల్పితంబగు శ్రవణానందంబను మహా
ప్రబంధమునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్ర వ ణా నం ద ము

## చ తు ర్థా శ్వా స ము

క. నూత్న ప్రఖ్యాతిజిత
ప్రత్నధరానాథమంత్రిరత్న ! సుకృతకృ
ద్యత్నదృఢచిత్త ! వేంకట
రత్నామాత్యమణి ! విబుధరాడ్రాజమణీ ! 1

వ. అవధరింపు మనంతరంబు. 2

క. మెల్లన మేల్కాంచి యతం
డుల్లములో నుండు వికృతి యొరుల కెవరికిం
దెల్లము గాకుండఁగ సం
ఫుల్లవదనుఁ డగుచుఁ గాలమును గడపుచుఁ దాన్. 3

క. ఏదియుఁ దోఁచక కడుఁ బెం
పేది ముదముఁ దక్కి "యెట్టు లీమోహజలం
బీఁదుదుఁ గర్తవ్యం బిఁక
నేది ?" యని మనమ్ములోన నెంతయు వగతోన్. 4

ఉ. ఈవిషయంబు మానుకొనుటే కడుసౌఖ్య మటంచు నెంచి తా
నావిధిఁ జేయ నిశ్చయము నందిన యంతనె మోహ మగ్గలం
బై వెనువెంట నంటు; నటులైనను జేయుదు నన్నతోడనే
భావము వేనవేలు ప్రతిబంధకముల్ గనఁజేయు నెంతయున్. 5

క. మానుదునా ! చేయుదునా !
మానుదుఁ జేయుదు నటంచు మల్లాడి యొగిన్

మానిన విచార మొక్కఁడె,
పూనియొనర్చిన విచారములు పెక్కులుగా! 6

క. అని తనమదిలో ననుకొని
యును బుద్ధినిఁ ద్రిప్పలేక యొగి నుత్తర మ
క్కనకాంగికి లిఖియింపుట
కును బ్రారంభించెఁ గొంత కొంత తెగువతోన్. 7

మ. రణదుద్యన్మణికంకణక్వణజితప్రద్యుమ్నకంఖాణికిన్
గణనాతీతకలాలసద్రమణికిఁ గాదంబినీవేణికిన్
గణికోద్యన్మణికిన్ బ్రశస్తతర రేఖాపాణికిఁ బాలికా
మణికిఁ వక్త్రజితాబ్జశీతఘృణికిన్ మాద్యత్పికీవాణికిన్! 8

క. అనవద్యయౌవనోదయ
ఘనరసికసమాగమాధికసుఖోదయనం
దనధనములు గలుగఁగ దీ
వన లిడి నా వ్రాయు వ్రాఁతవల నెట్టిదనన్. 9

క. కడుమాట లేల? విను, లోఁ
గడ మాకుఁ గలానిధిత్వకారణమునఁ జం
ద్రుఁడు బంధుఁడు నీకై కద!
బెడిసెం జంద్రునకు మాకు విమతేందుముఖీ! 10

క. కలువలతేనికి వేఁడిమి
చిలువకు విశ్వాస, మగ్నిశిఖకును శైత్యం
బలవడునుగాక, వెలకాం
తలకు వలపు గలుగు టది వినంబడదు కదా! 11

తే. గీ. అట్టిగణికాకులమ్మునఁ బుట్టినట్టి
దానవే కద! నీవును దరుణి నీకు
వలపు గలదన్న మూర్ఖునివంటివాఁడె
నమ్మనేరఁడు; నే నెట్లు నమ్మనేర్తు? 12

క. నిజమయిన వలపు గలుగని
గజగామినిఁ గవయువానికన్న నధముఁ డీ
త్రిజగతి లేఁ; డదియ యనం
గఁజను రసాభాస మనఁగఁ గాంతామణిరో! 13

క. ధనమును గులమును వృత్తం
బును రూపముఁ జూతు రెందు బోటులు; మీలోఁ
బని లేదు తక్కినవి యొక
ధనమె ప్రధానమ్ము గదవె తరుణీమణిరో! 14

తే. గీ. కోరితివి నన్ను; నాపోఁటిఫీరుఁ గోరి
యేమిసంపాదనముఁ జేసెదే లతాంగి?
ధనము గల్గినవాని నొక్కని వరింపఁ
దగు నదియ కాదె నీ కులధర్మ మరయ? 15

క. ఇదియంతయు నీమదిలోఁ
బదిలముగా నూహ చేసి వ్రాయవలెఁ జుమీ!
తుది నిష్ఠురంబుకన్నను
మొదటనె నిష్ఠురము మేలుఁగు పూర్ణేందుముఖీ! 16

క. అని వ్రాసి పంపె నంతట
దినకరుఁ డస్తాద్రి కేగెఁ దిమిరము ప్రబలెన్
వనజాహితుఁ డుదయించె మ
దనుఁడు పథికసతులమనముఁ దల్లడపఱచెన్. 17

క. ఏమియుఁ దోఁచక యవ్వని
తామణి యున్నంతఁ గమ్మ తారసిలుటయుం
బ్రేమ దలిర్పఁగఁ జూచి మ
హామోదముఁ జెంది తల్లి కంతయుఁ జెప్పెన్. 18

వ. తల్లియు సంతసించి "జాగు సేయక వినయపూర్వకమ్ముగాఁ బ్రత్యుత్తరముం బంపు" మని చెప్పుటయు నక్కన్నెమిన్న. 19

క. ఏమని వ్రాయుదు నీతని ?
కేమని వ్రాసినను నీతఁ డియ్యకొను ? నటం
చీమాడ్కిని యోజింపుచుఁ
దా మెల్లన నిట్లు వ్రాసెఁ దగునైపుణితోన్. 20

వ. శ్రీ మదుభయవేదాంత ప్రవర్తకులగు మధుసూదనాచార్యులవారి సన్నిధికి దాసురాలగు బాలామణి సాష్టాంగంబు లొనర్చి కుశలోపరి వ్రాసికొను మనవి. 21

క. నిన్నటిరాతిరినుండియుఁ
గన్నులుదీసికొని యెదురు గనుఁగొనుచును నే
నున్నతఱి మీర లంపిన
విన్నాణపుఁగమ్మ మదికి వేడ్క లొసంగెన్. 22

శా. తాపం బాఱె, విచారమా సడలెఁ, జిత్తంబా మహానందవి
ద్యాపారమ్యముఁ గాంచె, దైన్యగుణమా దౌదవ్వులంజేరె, నా
శాపాశం బతిదీర్ఘమై భవదపేక్షా వృద్ధిబొందించి యా
టోపప్రక్రియ నొప్పెఁ బూవిలుతుబంటుల్ నాకు బంట్లైరిఁకన్. 23

క. ఇందుకు సందియమును మీ
రందం బనిలేదు మీర లంపించిన క
మ్మం దగఁ గైకొని బ్రహ్మా
నందభరితురాల నైతి నానాగతులన్. 24

క. మిమ్ముఁ గోరిన దెందులకో
తమ రెఱుఁగుదు, రే నెఱుఁగుదు, దైవ మెఱుంగుఁ
సుమబాణుఁ డెఱుఁగు నిది ని
క్కము మీసందియముఁ బాపఁగానేరుతునే ? 25

ఉ. నాయెడఁ బ్రేమ లేనికతనం దమకన్నియు సందియమ్ములే
పాయక తోఁచుచున్నవి సెబా ! సిఁక మి మ్మన నేల ? మీమనం
బా యరవిందసంభవుఁడె యట్టు లొనర్చిన యప్పు, డింతకుం
గాయజుఁ డేమిసేయ సమకట్టెనొ ? మీమదిఁ ద్రిప్పనేర్తునే. 26

—• (సమస్య) పతి సతిఁ గవియంగఁ బుత్రసంతతి కలిగెన్ •—

క. అతికుతుకం బలరారఁగఁ
జతురత మెఱయంగ మదనశాస్త్రవిధమునన్
వితతంబగు తనసౌఖ్య
పతి సతిఁ గవియంగఁ బుత్రసంతతి కలిగెన్.

—• (సమస్య) బిగిచను లేతమాడఁగను బియ్యముదంచె లతాంగివేఁడుకన్ •—

చ. అగణితమైన వేగమున నట్టిటు వంగుచు లేచుచున్ ఘనం
బుగఁ దగురీతిఁ బాటలను బొల్పుగఁ బాడుచు "సువ్విసువ్వి" యం
చొగి ముసలమ్ము కేలఁగొని యూఁగుచు జోగుచు, తొమ్ముగొట్టుచున్
బిగిచను లేతమాడఁగను బియ్యము దంచె లతాంగి వేఁడుకన్.

ఈ శార్వరి సం॥ జ్యేష్ఠమాసములో ఈ విశాఖపట్టణములో రచియించిన మఱియొక యష్టావధానములోఁ గొన్నిపద్యములు.

—• (సమస్య) గుమ్మములో నున్నముద్దుగుమ్మన్ గాంచెన్ •—

క. కమ్మవిలుకాని చిల్కన
సమ్మద మొనరించుచున్ బ్రశస్తంబగు రీ
తిమ్మనమును గరఁపఁగఁ దా
గుమ్మములో నున్నముద్దుగుమ్మన్ గాంచెన్.

—• (సమస్య) పంద్రం గిక్కడి కెంతదవ్వొ చెపుమా, పంకేజపత్రేక్షణా! •—

శా. గుంద్రా కావలె నంచు నే నడుగ నాకుం బల్లెవా రందఱున్
బంద్రంగిం గల దంచుఁ జెప్పి రది నాభావమ్ములో నెంచి య
వ్వాంద్రన్ మెచ్చుచు దానిఁగొంటకయి యీప్రాంతస్థలిన్ జేరితిన్
బంద్రం గిక్కడి కెంతదవ్వొ చెపుమా, పంకేజపత్రేక్షణా!

—• (సమస్య) శృంగాగ్రాదపత న్మృగస్య రుదతో బాష్పాంబు భూమండలే •—

శ్లో. గత్వాకశ్చన భూపతి ర్మృదుగతి ర్వ్యాధాదికులం కాననం
ధృత్వైకం ధనుషా శరం ప్రహతవాన్ మార్గం శిశుం కోపతః

కర్తు ననుఁ గోరు, నేమనఁ గలదు మదను
వర్తనమునకు మా మనోవైఖరులకు.

32. ప్లవ సం॥ కార్తికమార్గశిరమాసములలో శ్రీకాకుళములో జరగిన శతావధానాష్టావధానములలోఁ గొన్నిపద్యములు.

చ. తిరుపతివేంకటేశకవిధీరులలో నొకరుండ, వేంకటే
శ్వరుఁ డనువాఁడ, నిన్నొకటి ప్రార్థనఁజేయఁగఁ బూనినాఁడ నీ
కరుణ శతావధానకృతికారణ మౌటను నేఁడు నాకు మా
తిరుపతిశాస్త్రి రానివెలితిన్ సవరింపుము దేవి మ్రొక్కెదన్.

—• పరమాత్మునిం గూర్చి •—

చ. సిరు లిడు నేమహామహుని సేవన, మెవ్వరికేని సౌఖ్యముల్
పరఁగఁగఁజేయు నేమహితుపాదనమస్కృతి, జ్ఞానమిచ్చు నే
పరముని నామసంస్మరణ, భద్రద మెవ్వని వృత్తి, తాదృశున్
జిరతరు నాదిపూరుషు భజింతు యజింతు సృజింతు సత్కృతుల్.

—• భక్తినిగూర్చి, (వసంతతిలకావృత్తమ్) •—

దారా స్సుతాశ్చ ద్రవిణం గృహ మంబరాణి
కాయం చ నిత్య మితి మా భ్రమ మూఢచేతః
భక్తిం కురుష్వ పరమాత్మని నిర్గుణేవా
నోచే న్మహాగుణయుతే తరణాయ నిత్యం.

— సప్తసంతానములలోఁ గృతి యధికమనుట •—

తే. గీ. తనుజుఁడు తటాకమును గృతి ధరణిదివిజ
వరుని నిల్పుట నిధియును వనము శివుని
కాలయము గట్టుటయు నివి యగును సప్త
సంతతులు వీనిలోపల సతము కృతియె.

—• తలిదండ్రులలో తల్లి హెచ్చని సాధించుట •—

తే గీ. కనుట యెంతేని నుత్కృష్టకష్టమునను
నేవమున కియ్యకొని పెంచు టెంచుకంత

సేగి గల్గిన నెమ్మవిఁ జింత గొనుట
తల్లి కాఁటను నాపె యుద్దఅను హెచ్చు.

—• తలిదండ్రులలో తండ్రి హెచ్చని సాధించుట •—

క. తలిదండ్రు లిపువురందున్
సులలితమతిశాలి నాత్మజునిఁ జేసెడివాఁ
డిలఁ దండ్రిగాన నతనిన్
బలుకందగుఁ దల్లికన్నఁ బ్రిబలుఁ డటంచున్.

—• అద్వైతసిద్ధిని గూర్చి •—

క. క్రమమున నజ్ఞానము నా
శమగుడు నశ్యమగు నెల్లజగ మాపైఁ 'ద
త్త్వమసి' యనెడి వాక్యము ని
క్కమగుట నద్వైతసిద్ధిగలుగున్దానన్.

—• సభలో నొక రిచ్చిన కల్పన •—

ఉ. సారయశస్కులౌ ఘనుల సచ్చరితమ్ములు గాంచి యన్యులున్
ధీరతఁ గాంతురి, వారిఁగని తెల్విని గొందరు వారివంశ్యులున్,
భూరిరజోవలిప్త మయి పొల్చెడి త్రోవను బట్టి యేగు న
వ్వారిపదమ్ములన్ దెలియవచ్చెడిఁగా పథ మెట్టిదేనియున్.

—• అన్న దాన ప్ర శం స •—

శా. దానమ్ముల్ వివిధమ్ములుండినను నద్దానమ్ములందెల్ల నా
త్మానందం బొనఁగూర్పఁ జాలు నది యన్నాఖ్యంబు, ద్రవ్యంబు నెం
తేనిన్ దెచ్చి యొసంగినన్ మనము తృప్తిం జెందఁగాఁబోవ, దే
రేనిన్ దృప్తిని గాంతు రన్నమున, నే రద్దాని శ్లాఘింపరో!

—• అ గ్గి పె ట్టె •—

క. ప్రతిదినము నగ్గి కంచున్
సతి ప్రతిగేహంబుఁదిరుగఁ జను పని తప్పెన్

భద్రుఁడై యొప్పు శ్రీరామభద్రు చరిత
మెవ్వరికినేని శుభముల నీయకున్నె!

—• చంద్రోదయము •—

క. కుముదమ్ములు వికసించెన్
గమలమ్ములయందుఁ దగు వికాసము లడఁగెన్
దమి హెచ్చె కాంతసతులకుఁ
గ్రమమునఁ జందురుఁడు వెలుఁగఁగా నంతంతన్.

—• ప్రతిభనుగూర్చి (ద్రుతవిలంబితము) •—

అనుపమానతయా ప్రతిభాతివై
సులలితా ప్రతిభా గతిభాసురా
ఇయ మతీవ లసేదితి నిశ్చయం
రచయితుం భువి కోను భవేత్ప్రమాన్.

30. ప్లవ సం॥ నిజశ్రావణములో రెడ్డిపోలవరములో నవధానము.

—• పట్టసపు వీరభద్రుఁడు •—

ఉ. కాశశరత్సుధాకరవికాసశరీరుని భూషణీకృతా
హీశు మహేశు సర్వజగదీశు సతీశు నతేశు ద్యోస్థలీ
కేశుఁ గృపానివేశు నలకేశహితున్ మనపట్టసంపు వీ
రేశు నుతింతు నాకు శుభమెప్పుడు గల్గుటకున్ మనమ్మునన్.

—• శ్రీ పోలవరపుజమీందారుగారు (లయగ్రాహి) •—

కమ్మవిలుకానిసొగసు మ్మెఱుఁగువెట్టఁదగు
నిమ్మయినమేనిసొబగు మ్మతివివేకి
త్వమ్ముదగుపోలవరపుమ్మహిపుఁ డెల్లప్రజ
లమ్మనుచు మాతృకవిధమ్ము గనుపట్టన్
ఎమ్మెయిని నవ్విభు మన మ్మధికశాంతగతి
పమ్మిచెలఁగున్ జగతి నమ్మహిపుఁబోలం

గమ్మహితుఁ డొక్కఁడు నిజమ్ముగను లేఁ డతిఘ
న మ్మతనిచిత్రిచరిత మ్మెవని కబ్బుఁగా.

—• సైరంధ్రీసింహబలులనుగూర్చి. (మందాక్రాంతావృత్తమ్) •—

సైరంధ్రీం తా మధికసుషమాం కీచకో వీక్ష్య రంతుం
దోష్ణా చేలాంచల మధికసంరంభత స్స్వీకరోతి
సా ప్యేతస్మా త్కథమపి పునర్గంతు మిచ్ఛం త్యతీవ
ప్రభ్రిష్టా త్మా ప్రకలితభయా వేపతే తాపతప్తా.

31. ప్లవ సం॥ ఆశ్వయుజమాసమున అనకాపల్లెలోని యవధానములో.

—• స్కూలు •—

క. పలుమందికి నుపయోగం
బొలయ ననకపల్లెలోన నొప్పారు మ్యుని
స్పలువారి స్కూలు దానం
గల గురువులుబాలకులును గడు సాధుమతుల్.

— జగత్తు మిథ్య యనుట. (వసంతతిలకము) •—

ఏత జ్జగ న్నహి మృషేతి సదాపి మూఢో
మత్వా పునశ్చ రమతే పరమార్థహీనః
జ్ఞానీ త్వసత్య మితి చేతసి నిశ్చనోతి
ప్రీతిం పరం త్యజతి తత్రి తతశ్చ హేతోః.

—• పో లీ సు జ వా ను లు •—

క. యమదూత లెట్టిరో యెఱుఁ
గ మనెడి లోపమ్ము దీర్పఁగా పోలీస్వా
రి మహిఁ బ్రిభువు లేర్పఱచిరి
కుమతులకే వారు వీరుఁ గూర్తురు బాధల్.

—• "యాంచింతయామి" అను శ్లోకమునకుఁ దెలుఁగు •—

తే. గీ. ఏనుగోరెడియింతి దా నితరుఁ గోరు,
వాఁడు మరియొక్కరితఁ గోరు, వనితఁ వేఱొ

పుత్రం బాణహతం విలోక్య సరతో భీత్యా తదా, భూమిభృ
చ్ఛృంగాగ్రా దపత న్మృగస్య రుదతో బాష్పాంబు భూమండలే.

—• రంగులు ఘోషించె మేఘరావము పోల్కెన్ •—

క. రంగుమెయి హూణు లందఱుఁ
బొంగుచు వందలకొలంది 'బోయస్సు' పయిన్
సంగతముగఁ గాల్పించు ఫి
రంగులు ఘోషించె మేఘరావము పోల్కెన్.

—• (సమస్య) సింగములన్ మట్టె గంధసింధుర మయయో •—

క. పొంగుచుఁ గొందఱు రాజులు
సింగారములొలుక వేఁటసేయంజని వే
డ్కంగెలనఁ దిరుగ నా రా
సింగములన్ మట్టె గంధసింధుర మయయో.

27. వినుకొండ.

శా. ద్రవ్యాశన్‌గాని కానిలోకమున సంస్తవ్యత్వసంపాదక
త్వవ్యామోహముచేతఁగాని యిటు లేతాదృఙ్మహాధారణా
దివ్యాప్యం బవధానమున్ సలుప నేతేఁబోము ప్రాజ్ఞాల్కవి
త్వవ్యుత్పన్నులు పిల్వనంప నిరసింపన్‌రామి నేతెంచుటల్.

మ. అవధానమ్ములు మానుకొందమన మా కాయేటి కాయేడు చి
న్నవా లేకుండినఁ బెద్దవో యొనరుపన్ మాన్యుల్ కవిత్వాభిలి
ప్సువు లీరీతిగ శ్రద్ధచేయునెడ నిష్టుల్‌గామి మాకేల ? యీ
వ్యవసాయమ్మను మాన మామరణ మో వాగ్దేవి ! వీక్షింపుమా !

మ. సెలవమ్మా ! వినుకొండ ! నీకిదె శుభాశీర్వాదపున్‌దండ ! ని
మ్మలబావీ ! భవదీయనిర్మలపయోమాధుర్యముల్ క్రమ్మఱన్
గలుగుంగావుత మాకు; తావకశుభాకారాంఘ్రియుగ్మంబు నా
దలఁదాల్తున్ దయయుంచు గుంటుహనుమద్దైవంబ ! రామేశ్వరా !

28. శార్వరి సం॥ ఆశ్వయుజములో నర్సారావుపేటయవధానములో

—• కొండవీటిసీమనుగూర్చి •—

సీ. నదిలోన స్నాన మేనాఁ డెఱుంగవుగదా!
పాతాళగంగాజపమ్మె కాని
శాల్యన్నమునకున్న సౌ రెఱుంగవుగదా!
గోఁగాకులును జొన్నకూడెకాని
శాకపాకాదుల చవియెఱుంగవుకదా!
దోసకాయల యడియాసె కాని
సౌధమ్ముల వసించు జాడెఱుంగవుకదా!
మట్టిమిద్దెల యునికి పట్టెకాని

తే. గీ. "ఒక్కకోటీశ్వరుండు నాయొద్ద నుండె"
ననుచుఁ గడు బిఱ్ఱవీఁగెద వతఁడుఁ గూడ
నాదిభిక్షకుఁ డంచు నీ వరయవొక్కొ
విగతసుఖభూమ, యో కొండవీటిసీమ!

29. శార్వరి సం॥ మార్గశీర్షములో కేశనకుర్తి యష్టావధానములో.

—• రామాయణము •—

సీ. దశరథేశ్వరు సపత్యంబయి జనియించి
యవనిపుత్రికను బెండ్లాడి మించి
పరశురామునివిల్లు భగ్నమ్ముగావించి
యటుపిమ్మట నయోధ్య కరుగుదెంచి
తండ్రియానతిని గాంతారమ్మునకు నేగి
ఖరదూషణాదిరాక్షసులఁ జంపి
యయ్యెడ భార్యాపహర్తయౌ రావణుఁ
జెనక సుగ్రీవుతోఁ జెలిమి నేసి

తే. గీ. కొని, వనధిఁ గట్టి యవ్వానిఁ దునిమి, పిదప
సీతతోఁ దనపురికి విచ్చేసి, పట్ట

మతిమంతు లగ్గిపెట్టెను
గతిగాఁ గల్పించుటన్ సుఖం బలరారెన్.

—• బాలవిధవలకుఁ దల గొఱుగఁదగ దనుట •—

సీ. అతిబాల్యమున భర్త గతియించినట్టి య
క్కన్నెకు విజ్ఞాన మన్న సున్న
యట్టి చిన్నతనాన నప్పసిగోలకుఁ
దల గొఱిగింప యత్నంబొనర్చ
కన్నను నజ్ఞానమున్నె ? యేమన్న స
న్న్యాసికే యది గొను టతిభరమ్మొ
గాఁదోఁచు, నెట్లనిఁ గానిమ్మొ ప్రకృతమ్మొ
వచియింతు సర్వానుభవమగుగతి

తే. గీ. నేరికేనియు వైరాగ్య మారయఁగ స్వ
బుద్ధిసమ్మతమైనచోఁ బొలుచు సుఖద
మై, బలాత్ప్రాప్తమైన నయ్యది యసహ్య
మగుటవారికిఁ గామంబు లడఁగు టెట్లు ?

—• సభలో నొకరు చదివిన శ్లోకమునకుఁ దెలుఁగు •—

చ. నలుదెసలన్ భ్రమించు మదనాగ మనంజను నిమ్మనమ్మొ వే
గ లలి రమేశుపాదమను కట్టను గట్టఁగ సారమైన జ్ఞా
నలవము తాను సంకెల యనన్ దనరారు మఱెట్టివారికిన్
సులభము గాని దయ్యదియెసూ ధరణీసురవంశరత్నమా !

—• పునర్జన్మము మాన్పుకొనుట కుపాయము •—

సీ. యోగ్యతగాఁ గాల మొక్కరీతినిఁ బుచ్చి
సంసార మొకభంగి సాగఁజేసి
యనివార్యగతిఁ గర్మ జనితమ్మొలై వచ్చు
కష్టసుఖమ్మొలకలిమి గనియుఁ

హామయులుగా నొనర్తురను నంశ మెఱుంగరొ? తల్లిదండ్రు లు
త్తము లనరాదె? వేఱొకవిధం బయినన్ మఱి సమ్మతింతురే? 71

చ. ఒకరకమైన పావడ మఱొక్కరకంబగు నైకయున్ మఱిం
కొకరకమైన పైఁటయు మఱొక్కరకంబగు భూషలున్ ధరిం
చుక ముకురంబుఁ జూచుకొని సొంపుగలేదని యెంచి, యంత వే
ఱొకటి మఱొక్క టింకొకటియున్ ఘటియించు వచేగువేళలన్. 72

వ. అట్లు వచ్చి.

చ. చదువను పేరెగాని యెకసక్కపుమాటల నాడుచుండు, నం
దొదవినయప్పుడెల్ల నెదియో యొకసంగతి దెచ్చి "పండితుల్
మొదలె యబద్ధమాడెదరు, మోసముచేతురు వారినమ్మ బొ
ప్పదుసుఁడి" యంచుఁబల్కితలవంచినగుణ్ మొగమెత్తుఁగ్రమ్మఱన్.

చ. పలుచనిపండుటాకులకు బాగుగ నీనెలుడీసి చక్కఁగాఁ
జిలుకలుచుట్టి దొంతరలుచేసి యమర్చి కరాంగుళీదళం
బుల నిఱికించి తెచ్చి వలపుల్ మొలపించుచు నిచ్చి యంతటం
బలుకును జిల్కపల్కులను వ్యంగ్యపురంగు చెలంగి పొంగఁగణ్. 75

శా. ఎంచు న్మర్మము లెత్తి మాటికిఁ, దుటాయించుం గనుల్, బల్మిటా
రించుం జన్గవపై చెఱంగు, వల పూరించున్, నగించున్, బ్రిశం
సించుణ్, మించుమనోవికారమును సూచించున్ మరుల్ వెంచున
మ్మించుంబోఁడిస్వభావమో? యతని నమ్మించన్ బ్రియత్నించుటో?

చ. ఎడపక యెల్లవేళ మఱి యెప్పుడు చూత మటన్నఁగాని య
క్కడనె వసింపుచుండుటయ కాని యొకానొకవేళనైనఁ దాఁ
దడయక యింట నుండినవిధం బది యెట్టిదియో యెఱుంగ ద
ప్పడఁతుక, దానిచిత్తమును బట్టిన భూత మదెట్టిదో కదా 77

సీ. ఒకమాఱు మనుచరిత్రకథాంశోషమున వరూ
ధిని మరుల్ సెంచుపట్టునను జదువు
నొకమాఱు నాయికాదికచేష్ట లెఱిఁగించు
రసమంజరీరసప్రసృతిఁ జదువు

నొకమాఱు నభినయప్రకటీకరణచణా
భినయదర్పణరసాభిరతిఁ జదువు
నొకమాఱు గానవిద్యోపయుక్సారసం
గ్రహముఖ్యగ్రంథసంగతులు చదువుఁ

తే. గీ. గ్రొత్తక్రొత్తలు జావళీల్ క్రొత్తక్రొత్త
పదములును గ్రొత్తక్రొత్తలౌ వర్ణములును
నింపు దళుకొత్తఁగోరి రచింపఁ జేయు
నేమి చెప్పఁగవచ్చు ? నయ్యింతిచర్య. 78

ఉ. ఆ వగలాఁడి వచ్చువఱకు కాతఁ డనంతవిషాదవేదనల్
భావమునందుఁ జెందు; నటుపైఁ జనుదేరఁ గ్రమక్రమమ్ముగాఁ
జేవ మనమ్మునం దగులఁ జేయును గాని మనోవికారసం
భావన బైటఁ బెట్టఁ డఁట ! బాపురె ! యాతనిభావ మెట్టిదో ! 79

ఆ. వె. ఆ సరోజనేత్ర యరుదెంచువఱకె సం
తాప మతని, కా లతామనోజ్ఞ
అరుగునంతవఱకె యామోద మీగతి
నరిగెఁ గొన్నిదినము లంతలోన. 80

ఉ. వేసవి వచ్చె భాస్కరనవీనగవీనమితామితాచ్ఛగు
చ్ఛాసవవాసనైకవలనాకలనాకులనాయికాసము
చ్ఛ్వాసనశాసనాదికృతిఝంకృతిసంకులషట్పదావళీ
భాసురశుష్కపుష్పవిటపప్రకరప్రతిభాప్రమోదమై. 81

సీ. సూనబాణునికేళిఁ జొక్కి యక్కన ప్రాలు
ప్రియురాండ్ర బైఁటచే విసరువారు
విసరిసందులకునై కొసరి యింకొకసారి
వెడవెడపనుల కొప్పించువారు
నొప్పించినను నొప్పకున్న క్రొన్ననబోణు
లను మాఱదోయు దీర్పు" మవెడివారుఁ

దీర్చుకొమ్మన్న విదిర్చి శయ్యను డిగ్గి
చనువారిఁ గని ముద్దుఁ గొనెడివాడు

తే. గీ. ముద్దుఁగొని సుద్దులను గొంతప్రొద్దు జరపి
మలయవాయువు లిరువురఁ గలకదేర్పఁ
గలయఁదమకెంచి కోడికూఁతలకుఁ దలఁకు
వారలై రఁట గ్రీష్మవిభావరులను. 82

చ. వదలినఁ జచ్చిపోదు మనువారలు తక్క సమస్తదంపతుల్
పొఎలెడి గ్రీష్మతాపమును బొంది సహింపఁగలేక తెల్లవా
ఱునయిక వేఱువేఱుగఁ బరుండి నిశాంతసమీరపోతసం
పద లొలయంగ నైక్యగతి వర్తిలఁ బూనుదు రట్టివేళలన్. 83

ఉ. వేసవితాప మిట్టి దని వేమరు నొక్కి వచింప నేల ? యా
యాసము నొంది తాపమున కాఁగఁగ లేక రమావిభుండు వా
వాసముఁజేసె నంబుధి నివాసముఁ జేసె నుమేశుఁడున్ హిమా
నీసము పేతపర్వతవసీతటినీతటకుంజమండలిన్. 84

చ. ఇతరుల దాహపుం గతుల నెన్నఁగ నేల ! దినేశు నంతవాఁ
డతితరతృష్ణచేఁ దన సహస్రకరమ్ములు సాచి నేమపుం
గతి విడనాడి గుంటలనె కాదు, నదమ్ములఁ గాదు, కూపసం
తతులనె కాదు కంటికి గనంబడి నంతయుఁ ద్రావె నీరమున్. 85

ఉ. అట్టి బెడంగుకాఁక నలరారి వెలింగెడి గ్రీష్మతాపసం
ఘట్టనకున్ స్మరాగ్ని యలుకం గని దాని జయింతు నంచు బల్
పెట్టతనంబు పూని కడు వృద్ధినిఁ జెంది వియోగతప్తులం
బట్టి పలార్చెఁగాని పరిపంథినిఁ బట్టి పలార్చ నేర్చెనే ? 86

శా. వచ్చెం బ్రోషితభర్తృకాంగనల తాపం బార్పఁ బెన్గానలం
జిచ్చుల్ వూయఁగఁ జేయ సస్యములకున్ జేయూఁత గై సేయ వి
ద్యుచ్చంచద్ఘనమాలికానినదభీత్యుద్వేజితస్వాంతయో
షిచ్చారూన్నతమాంసలస్తనభరాశ్లేషంబు వర్షర్తువున్. 87

తే గీ. వాన కేళీగృహమ్ములు వదలనీదు
చలి తమంతనె కౌఁగిలింతలను దార్చు
మబ్బు రాత్రిందివమ్ముల మాటుపఱచు
వర్షఋతువంత దేది ? దంపతులదాది. 88

క ఘోరునఁ బడియెడివర్షా
సారంబులు వహ్ని నపుడు చల్లార్చంగాఁ
జారుస్త్రీకుచకలశా
ధారంబై బ్రతుకుఁ గాంచె దంపతిమధ్యన్. 89

వ. అట్టియెడ వింట నెవ్వరును లేని యొక్కనాఁటి రాత్రిసమయమ్మున నత్తలోదరి మితభూషితాంగియై "అనుగుణంబగు సమయంబు నేఁటికిఁ జేకూరె" నని సంతసింపుచు రహస్యపరికారమ్మున. 90

ఉ. వచ్చి గృహమ్మునొచ్చి యొకవైఖరి నాతనిఁజూచి యంతఁ దా
వచ్చపలాక్షి యాతఁ డసహాయత శయ్యఁబరుండి గ్రంధమున్
జెచ్చెరఁ జూచుచుండఁ దరిఁ జేరఁగ సందియమంది ద్వారమం
దచ్చపు బంగరుంబ్రతిమ యట్టుల డాఁగిలియుండె క్రమ్మఱన్. 91

క. మెలమెల్లనఁ జని శయ్యా
తలనికటమునందు నిలువఁ దత్తఱమున న
వ్వెలఁదుకఁ బొడఁగని యాతఁడు
నిలువున నీరాయె నదియు నివ్వెఱపడియెన్. 92

క. అతఁడును నదియును నిటుల
ప్రతిపత్తివిమూఢగూఢభావోదయసం
గతులై యుండిరి క్షణపరి
మితకాలం బదియు శక్యమే ? వర్ణింపన్. 93

సీ. తనకు నద్దానిపై మనము పుట్టకయున్నఁ
'బొమ్ముపొ' మ్మని చెప్పఁబోలదొక్కొ !
ఇచ్చగల్గినఁ జనవిచ్చి కౌఁగిటఁ జేర్చి
మరుకేళిఁ గరఁగింపు టెఱుఁగఁడొక్కొ !

అక్కఱ్ఱెన్నైమెవతెమో యనుట కింతకుమున్ను
పరితిదినమ్ముసు గంటఁ బడనిదొక్కొ!
పాపపుంజము ధ్వంసపడుట కీలోననే
హృదయసంగతులచేఁ బొదలఁదొక్కొ!

తే. గీ. కామశాస్త్రపరిశంసలఁ గనఁడొ, వినఁడొ!
యేమిభావించెనో యాతఁ డెవరికెఱుక?
రమ్మనియుఁ బొమ్మనియు మాటరాదు నోట
"వలపు సానికిఁ బలుపు దెబ్బలు" ఘటించు. 94

తే. గీ. ఆటులఁ డన్నాదరింపని యతనిరీతిఁ
గాంచి పడిలోనఁ గోపమ్ముఁగదుర మఱలి
పోవుటకు నుద్యమించి యోర్పునిగుడించి
యించుక మనమ్ములోన యోజించి మఱియు. 95

ఉ. దాపునఁజేరి హస్తమునెదం గదియించిన యంతమాత్రనే
కాఁపుర మాయె మేను పులకప్రకరమ్ములకున్, మనమ్ములోఁ
గాఁపురమున్నజ్ఞానము పికాపికలై చనె; నెట్ట కేలకుం
బాపపుభీతియుం దొలఁగి పర్విడె; నెంతకుఁ జాల రంగనల్! 96

శా. ఆరీతిం గని యాసతీతిలక మత్యానందముంజెంది "ని
న్నే రామామణి యిట్లుచేయఁగలదోయీ? యంగనాయోగ్యమౌ
గారామెల్లను నీవచేసెదవు పో! కాకేమిరా!" యంచుఁ గ
ర్పూరామోదితపూగసంకలితతాంబూలమ్ము నందిచ్చుచున్. 97

ఉ. "మంచిదికాని" 'వేశ్యలకు మాయలు మెండెటువంటివారలన్
వంచనఁజేతు' రందు; రది వాస్తవమే; తమవంటి వారికిన్
వంచన మంచి గాదుకద? వచ్చెడియట్లనె యుత్తరమ్ము వా
యించియు రాకపోవు టిదియేకద? ధర్మము మంచివారికిన్." 98

తే. గీ. అనిన నతఁడిట్టులను "నింద్యమనియుఁ బాప
మనియు నేమానితినిగాని యన్య మెఱుఁగఁ;

జేతునని చెప్పియును జెడ్డ సేయరాదు,
చేయననిచెప్పియును మంచిచేయవచ్చు. 99

ఉ. ఇప్పటికైనఁగాని మనమెంతయు సందియమందుచుండె నీ
తప్పులనెప్డు నే నెఱుఁగఁ దన్విరొ! నీవు కతమ్మనంగదా
యిప్పటి కిట్టిరీతి ఘటియించె; మఱొక్కటి విన్మ, నీమెఱం
ద ప్పెపు డబ్బునో యపుడ తప్పఁజుమీ! మనస్నేహభావముల్ ”

క. అని ప్రతినదోఁపఁ బలుకుచు
ననుకంపాకంపితాంతరంగుండై య
వ్వనితామణికిన్ వశుఁడై
యనుకూలుండై పరవశుఁడై తమిఁ జెందెన్. 101

సీ అజ్ఞాతగాత్రభేదజ్ఞానవిలసనం
బనతీతరతిరహస్యాగమంబు
అనిరుద్ధదంతచ్ఛదామృతాస్వాదనం
బప్రియత్నాప్తబంధానుగమము
అనిమిత్తత-డనాన్యోన్యసంభృతసుఖం
బజ్ఞేయపూర్ణమోదానుభవము
అనపసంహృతవచఃప్రారంభసంరంభ
మనివార్యఘర్మోదకావతార

తే గీ. మవిదితనఖక్షతవ్యథం బపరిమేయ
రసవిశేషపరిసార మరాళచేష్ట
మనియతాలింగనాఢ్య మవ్యాజగంధి
పరిధమవిధువన మక్కవిపరివరుఁ డెనసె. 102

సీ. చూచునేమొకొా సిగ్గుచోటులంచును మధ్య
మధ్యఁ గౌఁగిటి కొక్కమాఱుఁ జేరుఁ
గోపగించునో యంచుఁ గొలఁకుగుబ్బలమధ్య
మధ్యఁ జేతులకొక్కమా తొాసంగుఁ

బరిహాసించునొ యంచు బల్రయమ్మున మధ్య
మధ్య నాపక యొక్కమాఱు పెనఁగు
శ్రమఁజెందునో యంచుఁ జవుఱు వేఱఁగ మధ్య
మధ్య నోష్ఠ మ్మొక్కమా ఱొసంగు
తే. గీ. ముష్టులిడి యొడలెఱుఁ గమిమోపిఁ గొఱుకు
బసులుతీర్చునెయసి చేతఁబట్టు ఱొమ్ము
రాజ్యమిది నాదియంచు గర్వమ్ముఁ జూపు
నుపరతమొనర్చు వేళ నయ్యువిదమిన్న. 103

క. కుచకించిచ్చలనంబు క
టిచమత్కారంబు మేని తీవి ఔషకుఁజూ
పుచుఁ దకు సారెకు వర్ణిం
పుచు మెచ్చె నతండు దాని పుంభావంబున్. 104

చ. ఎఱుఁగరు కష్టమింత సుఖమింత విలాస విశేషమింత యం;
చెఱుఁగరు మోహమింత వలపింత పెనంగిన దింతయంచు నా
సరసుఁడు నా సఖీమణియు సౌఖ్యరసాంబుధిలోన మున్గి తే
లిరి; వివరింప శక్యమె ! బళీ ! మఱి వారి వినోదవైఖరుల్. 105

వ. అంత. 106

తే. గీ. జారిణీజారసురతపరిసంగభంగ
మంగజానంతతాపశాంత్యౌషధంబు
చోరకృత్యాంతరాయ మాచారివిప్రి
కోటివిజ్ఞప్తి విననయ్యెఁ గోడికూఁత. 107

వ. అంత 108

సీ. వలిగిపోయిన పుష్పములు కీలుజడనుండి
యడుగడ్డునకుఁ దోవయందు రాల
మలయు ప్రాతఃకాలమలయవాయువులచేఁ
జెమటబిందువుల మొత్తము లణంగఁ

గురియు నున్మంచుతుంపురులు కెమ్మోవినొ
క్కుల కించుక భరమ్ముఁ గలుగఁజేయ
నతిరతిపరవశస్థితి వియ్యమంచు ని
ద్దుర నెత్తి కెక్కె తత్తఱముఁజూప

తే. గీ. 'నెవరు చూచెదరో' యంచు నించుకంత
భయముగల్గియు 'నాకేమి భయ' మటంచు
దిటము మదిలోననూని యచ్చటులనేత్రి
"టింగురంగా" యటంచు నింటికిని జనియె. 109

క. దీనజనాదరణా : శర
ణానుగతాభరణ : సంతతాశ్రితశరణా :
నానావిధగుణవరణా :
భూమతచరణాయుధాంకభూతేట్స్మరణా : 110

శా. ఆగర్వానుగతప్రకృష్టధనధాన్యామూల్యసౌధాదిసు
శ్రీగణ్యా : సరనాగ్రిగణ్య : సితనీరేజాతవాతాశనే
ద్రాగాలంకరణాగశీతనగమాన్యస్వచ్ఛకీర్తిప్రభా :
భోగత్యాగసుయోగ : సత్కవిజనాంభోజాబ్జినీబాంధవా : 111

స్రగ్విణి. శ్రీమదానందవర్ధిష్ణుజిష్ణూదయా
రామ : కామేశ్వరీప్రాజ్యదీవ్యద్దయా
సీమ : సీమంతినీశ్రీతనూజానయ
గ్రామ : కామేశ్వరీగర్భవందోదయా : 112

— గద్య —

ఇది....శ్రీతిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన
కేవలకల్పితంబగు శ్రవణానందంబను మహా
ప్రబంధమునందుఁ జతుర్థాశ్వాసము.

—• దారము •—

క. హారములు గుచ్చికొనుటకు
దారములగు వస్త్రములను దగఁ గుట్టుట కా
ధారమగు దారమును నే
వారేనియు మేటియనుచుఁ బలుకఁగవచ్చున్.

—• భారతయుద్ధం (జలధరమాలా) •—

భీష్మద్రోణౌ ప్రభురపి కౌరవ్యాణా
మశ్వత్థామా కదనకలాఢ్యః కర్ణః
పాండోఃపుత్రై ర్ఋజుతరచారిత్రై స్తై
ర్యుద్ధ్వాప్రాప్తాః పరిభవ మస్త్యేస్వాకం.

—• పకోడి (ఉత్సాహ) •—

సెనగపిండి యుల్లిపాయ చిన్నిమిర్పకాయలుం
జొనిపి యందు నల్లమింత చొనిపి ముద్దచేసియున్
అనలతప్తమైన నేతియందువైచి వేచినం
జనుఁ బకోడి యనెడుపేరఁ జక్కనైన ఖాద్యమై.

—• వేంకటేశ్వరః (ప్రహర్షిణీ) •—

సేవేఽహం తిరుపతివేంకటేశ్వరం తం
శ్రీవాణీధవముఖనిర్జరాభివంద్యం
శ్రీనీలావిలసితపార్శ్వభాగ ముద్య
త్తేజస్కం కలియుగదైవతం జనానాం.

—• చంపకపుష్పము (సుగంధి) •—

చంపకమ్ము భాసిలుం బ్రశస్తమైన శోభచే
నింపు పుట్టఁజేయుచున్ మహీరుహాలతోఁటలో
లంపటంబుగాదు భృంగరాజి దీనియందు, నీ
కంపు దాని కింపుగామిఁ గంపమానచిత్తమై.

—• కాముకః (వాతోర్మీ) •—

దరిద్ర్యే నష్టే స్వసతీమానసేఽలం
రుష్టేఽకీర్త్యాం ప్రసరంత్యా మతీవ
శంకాం వాప్నో త్యథ యద్యద్వ్యవేద్యా
కామీ స్వర్గం పదతం వీక్షమాణః.

—• సూది •—

ఉ. కాలను గుచ్చుకొన్న ములు గ్రక్కునఁదీసికొనంగ, బట్టలన్
మేలిమిఁగుట్టుకోఁగ, నెలమింగరణంబయి యొప్పు సూదితోఁ
బోలఁగనేర్చువస్తువుమ భూమి నిఁకొక్కఁడు చూడనేం మి
క్కాలమునందు జీవనముగా విది యెందఱిఁ బెంచుచున్నదో.

—• పనస్కము •—

శా. శ్రీరంజిల్లెడి లంకయాకుఁగొని వాసింబొల్పు హైయంగవీ
నారూఢమ్మగు పన్నముం జొనిపి యం దత్తర్వు నొక్కింత యెం
తే రంజించియు బిల్వసత్ఫలమునం దెక్కించి యా చూర్ణమిం
పారం బీల్చుటకన్న వేఱుగలదే యానంద మూర్వీధవా.

—• హూణ కాంత •—

సీ. మంచుబాలునుజూచి యించుమించుగనవ్వు
మేనిమేల్జిగి మిఱుమిట్లుగొలుప
నాపాదమస్తకంబై యొప్పుగాగరా
వడుమునం దొకవింత బెడఁగుదెల్ప
తిలకశూన్యంబయి దీపించు నెమ్మోము
నిష్కళంకాబ్జువి నేర మెంచ
అత్యంతమృదులమ్ములై యొప్పు పల్కులు
వినువారిపీనుల విందుగాఁగ

ఆ. వె. భర్తృసంగృహీత బాహమై చల్లవి
గాలికై షికారుగా సుమాళ

మైన రీతి రాఁగ నరసితి నొక హూణ
కాంత, దాని చెలువు కనుల విందు.

## — నూ జి వీ డు —

సీ. ఎచ్చోటఁజూచిన నింపుమీఱెడి రాజ
సౌధమ్ము లేన్గులు సంచునించు
నెయ్యెడఁగనుఁగొన్న నెలమినించెడి మంచి
యశ్వముల్ కనులకు హాళినొసఁగు
నేచక్కి వీక్షింప రాచబిడ్డల శికా
ర్స్వారటుల్ గనువారి సూరఁజేయు
నేవంకఁగనినఁ బారావారపర్యాయ
ములు తటాకములు పెన్ముదము నించు
తే. గీ. నెచటఁ జూచినఁ జెంకుటిం డ్లెచటఁ గన్నఁ
బూలతోఁటలు మదికి మేల్ హాళిఁ బెంచు
నూజివీడుపురం,బది రాజధాని
యప్పరాయాన్వయజులైన యధిపతులకు.

## — క వి త్వ ము —

చ. సరసత చక్కఁగా నెఱుఁగు సజ్జనులన్ ముదమందఁ జేయుచున్
విరసులవంకఁ బోక పృథివీతల మెల్లెడ స్వానువర్తులన్
దిరుగఁగఁజేయుచున్ నృపుల తేజము శాశ్వతమైన ఫక్కిమై
వఱలఁగఁ జేయు సత్కవితవంటి కలల్ మఱి యెందుఁ గల్గునే!

## — ప ట్టు ద ల (శార్దూలవిక్రీడితం) —

శా. ఎంతే ద్రవ్యము వమ్మొనర్చుటకు లో నింతేని శంకింప రా
వంతన్ ధర్మ మధర్మ మంచు మదిలో నాలోచనంజేయ ర
త్యంతం బాత్మజుఁ డంచుఁ దమ్ముఁ డనుచుం దారంచు నొల్లంచునున్
ఖంతంబున్ గనువారు చూడ రిలఁ గోపం బొందు దక్కన్ నృపా.

—• జూదము •—

క. వ్యసనము లన్నిఁటికన్నను
బసగలయది జూదమగును బాండవు లిద్దా
వ ససిచెడి యడవిపాలై
వసమరి రని వినమె దీవి వలవదు తవులన్.

—• తేలు •—

క. తన సహజగుణము కతనన్
బనిగొని యెద్దాని వేని పడఁగుట్టెడి తే
లునకున్ ఖలునకు భేదము
గనుఁగొనిన నొకింతయేనిఁ గమపడదు నృపా!

—• బైసికిల్ (శార్దూలవిక్రీడితం) •—

శా. నీరుంగోరదు గడ్డినడ్గ దొకకొన్నే నుల్వాలన్ వేఁడ దే
వారే పెక్కినఁ గ్రిందఁ ద్రోయ దొకఁడున్ బజ్జన్ భటుండుంట చే
కూరంగావలదెందు బైస్కిలునకుం గోపం బొకింతేని లే
దౌరా! వాజికి సాటియైన యిది విశ్వామిత్రసృష్టంబొకో!

—• గుఱ్ఱపు సవారు (మౌక్తికమాలా) •—

వేగవశేన ప్రిచలతి వాహే
చిత్రవిచిత్రై ర్మృదుగతిభేదైః
తద్గతపుంసో భవతిహి సామ్యం
వ్యస్తవిలాసానుగతతరుణ్యా.

—• తమలపాకు •—

క. కడు తెలుపు గలిగి యెంతయు
నిడుపును వెడలుపునుగలిగి నిగనిగమైఁ జొ
ప్పడు తమలపాకు భోజన
మడరినపై లేకయున్న నది భోజనమే?

—• ఎడ్వర్డు పట్టాభిషేకం (శార్దూలవిక్రీడితం) •—

టాౢవన్కూరున్నృపాలకోఽపిచ మహీశూరాధిపో హైదరా
బాదాపట్టణసార్వభౌమ యవన శ్చాన్యేపి భూపాలకాః
యస్యాస న్కరదా స్సభాతి నితరా మెడ్వర్డుభూపాలకో
విక్టోర్యాకృత పూర్వపుణ్యవిభవః పట్టాభిషేకోత్సవే.

—• ఆంజనేయులు •—

ఉ. వారిధి దాఁటినావు బలవంతుల రక్కసులన్ జయించి శ్రీ
భూరమణీసుతన్ గని విభుండగు రాముని క్షేమవార్త నిం
పారఁగఁ దెల్పినావు జగదాదృతమౌఁగద నీచరిత్ర హె
ధీరనుతా ! కవీంద్రనత ! దివ్యమతా ! లసదంజనాసుతా !

—• ప్లీడరులు •—

సీ. ఆబాల్యముననుండి యర్థవ్యయముచేసి
తల్లిదండ్రుల వీడి తనదు గ్రామ
మనక పౌన్నూరన కనయమ్ము విద్యకై
పలుపాట్లుపడి మీఁదఁ బ్యాసుచేసి
యాపయిఁ గోర్టునకరుదెంచి పట్టాను
గైకొని చక్కఁగాఁ గ్రాసుచేయు
నేర్పు సంపాదించి నీతిబాహ్యుఁడుగాక
న్యాయరీతి నెసంగు న్యాయవాది
తే. గీ. పేరు ఘృతకోశసామ్యమ్ము గూఁగ దంక
నూరక జమీనుదారుల కుబ్బొనర్చి
'వ్యాజ్యములు వేయు' మనెడి కపటమతులకు
న్యాయవాదిత్వ మేరీతి సార్థకమగు ?

—• శ్రీ రంగాయప్పారావుగారు •—

శా. చంగత్కీర్తివిరాజమానుఁడు కలాసామ్రాజ్యధౌరంధరీ
భంగీసంగి మహానుభావుఁడు కృపాపారంగతుం డన్నదా

నాంగంబుల్ పలుసత్రములు నిలిపె నే యాఢ్యుం డతం డొప్పు శ్రీ
రంగాప్రావభిధానుఁ డుత్తమకవిప్రఖ్యాభిధేయాఖ్యుఁడై.

—• స్నా న పు రే వు •—

సీ. పొడిబట్టలను విప్పి తడిబట్టలను గట్టి
పేరటాం డ్రొకవంక సౌరు నింప
నీర్కావిదోవతుల్ నేర్పుమై నుదికెడి
వర్ణిసంఘమ్మొక్క వంకఁ జెలఁగ
"నా కిమ్ము రి క్తుఁడ నా కి" మ్మనుచు నీరు
కాసుబాపలును నొక్కచోటఁ జెలంగ
నాభరణాదుల నపహరింపఁగఁజూచు
పశ్యతోహరు లొక్కప్రక్కఁదనరఁ
తే. గీ. తీర్థములయందు రేవు లెంతే నెసంగుఁ
గనెడివారల కెంతయుఁ గనులపండు
వగుచు శ్రీయప్పరాయ వంశాబ్ధిచంద్రి
యఖిలకవిగేయ ! రామచంద్రాప్పరాయ !

—• ఆశీర్వచనం (శార్దూలవిక్రీడితం) •—

శ్రీరాజత్సుతరాజితో విజయతాం శ్రీరామచంద్రాప్పరా
ట్తద్దత్తై రపి వార్షికైః కవివరా గచ్ఛంతు మోదం భృశం
తద్దీవ్యత్సదసి ప్రవృత్త మిదమ ప్యాస్తాం వధానం చిరం
యే నాత్యంతముదం సుధీసముదయో యాతుంచబోభూయతే.

37 శోభకృత్సం॥ వైశాఖమాసము తోట్లవల్లూరు సంస్థానములో.

—• అ వ ధా న స్థ ల ము •—

క. బంగాళాతోఁటను ముద
ముంగొలుప శతావధానముం జేయించెన్
సంగతమగుగతిఁ గవు లు
ప్పొంగఁగ శ్రీభాష్యకారభూపతి బళిరే !

—• వల్లూరు గోపాలుఁడు •—

మ. వరముల్ భక్తులకెల్లవేళనిడు శ్రీవల్లూరి గోపాలకుం
డు రహిన్ బోర్శిపుత బమ్మదేవరకులాఖ్యున్ భాష్యకారాధిపున్
గరుణాసాగరు సర్వలోకహితుఁ జంగత్ర్వాభవోపేతు భా
స్వరవల్లూరిపురార్ధపాలకు యశస్సత్యప్రభాభాసురున్.

—• ప ట్టా భి షే క ము ను గూ ర్చి •—

సీ. అన్నతోఁబోరాడి యన్నికోరుటులను
దిరిగి తుదకు జయంపురహిఁ గాంచి
బహుసంపదలతోడ భద్రపీఠమ్మునఁ
దగుగతి శోభకృద్వత్సరమున
మాధవమాసాన మంత్రిపురోహితా
దులు గొల్వ మిగుల సంతోష మెసఁగఁ
బత్నియుఁ దానును బ్రజతోడఁ బట్టాభి
షిక్తుఁడై యెసఁగె సుశ్రీదలిర్ప

తే. గీ. ప్రజలకెల్లను గన్నులపండువయ్యెఁ
జూపరులకెల్ల మిక్కిలి చోద్యమయ్యెఁ
బండితులకెల్ల మనమునఁ బ్రమదమయ్యె
భాసురంబయ్యె వల్లూరిపట్టణంబు.

—• పట్టసవీరభద్రః (స్రగ్ధరా) •—

యోవా దక్షాధ్వరేఽభూ దతికుపితశివస్వేదధారాప్రభూతో
యోవై తూర్ణం చకార ప్రకుపితమనసా భాస్కరం భగ్నదంతం
యోవా దేవా నశేషా నకురుత వికలాన్ కాందిశీ కాంత్స పాయా
దక్షద్రో వీరభద్రో హుతవహతులితః పట్టసక్షేత్రపాలః.

38, శోభకృత్సం॥ జ్యేష్ఠమున నెలూరునం దష్టావధానములో.

—• హయగ్రీవః. (స్రగ్ధరా) •—

శ్రీమంతం సర్వవిద్యావిహరణవసతిం వాజివక్త్రం మహాంతం
విద్వద్భి ర్నమ్యమానం దురితవనహరం దుష్టరక్షోఽపహారం

త్వంగత్వాకారుణ్యపూర్ణం సకలభువనసంరక్షణే బద్ధదీక్షం
భక్త్యాబద్ధాంజలిస్సన్ శుభవిభవకృతే నౌమి లోకైకనాథం.

—• "ఆయాహి యాహి" యను శ్లోకమునకు తెలుఁగు •—

చ. జనకజ! రమ్మిటుల్ చనుము సాధ్వి నగస్త్యనిభామఁ జూచి, పై
వినుచుము రావణాదులను వేచినసంగతి నిర్భయమ్ముగా,
వననిధి గట్టు ముచ్చట రవంతయుఁ దెల్పకు, మాపె దాని గ్రిం
గిన మునినాథుభార్యసుమి, ముగ్ధరో! నీకెఱుఁగంగఁ జెప్పితిన్.

—• నారికేళః, (రథోద్ధతగతిః) •—

కుజే ష్వతితరం ఫలాని దధతే
ఫలేతు జలమ ప్యలం ప్రసరతి
అనేకవిధయా కరో త్యుపకృతిం
తతో లసతు నారికేళపదపః.

—• ప ద్మి నీ ల క్ష ణ ము •—

క. తెలుపగు చీరలు గట్టున్
సలుపున్ బతిభక్తి మిగులసద్గుణగరిమన్
బొలుచున్ స్త్రీజనమునకున్
దిలకంబై యెందుఁ బద్మినీభామ భువిన్.

39. క్రోధి సం॥ పుష్యములో నూజివీడులో అష్టావధానములో.

—• జపాన్ రష్యాయుద్ధము, (రథోద్ధతావృత్తమ్) •—

వర్తతే ఖలు జపానుభూపతే
రష్యకావనిపతే రపి శ్రియై
సంయుగోఽయ మసమాన కక్షయా
వృద్ధి రద్యతు జపానుభూపతేః.

—• (సమస్య) అల్పాచమాన మరవిందముఖీ చకార •—

భర్త ర్యతీవ విటశేఖరతాం ప్రయాతే
తస్త్రైవ చిత్తమనఘం సతతంచకృత్వా

ఉ. అన్నిటి కేమిగాని మగువా! యొకటే నిజమైనమాట, నీ
చిన్ని మెఱుంగుఁజూపులను జిత్రిపుఁ దియ్యని మొలకనవ్వులుం
దిన్నని భక్తియుం దనివి దీఱని ప్రేమయు నెంతతంచ్చిరో
నున్నను నిన్ దలంపుటకు నోపిక నాకిడఁజాలెడుం జుమీ. 47

చ. మమత దలిర్పఁగా సుపరిమన్మథకేళిని గూడువేళ "నో
రమణిరో! నన్నుఁగూడి యిటు అంతులు సేయఁగ నీకుఁ జెల్లెఁగా
క మహిని దేని కా" ననినఁ "గాక మతే, మిది నాడుపూర్వపు
ణ్య" మని వచించు నీదు వచనంబులు నామది నాట కుండునే? 48

ఉ. రాపిడి గబ్బి గుబ్బల నురమ్మునఁ గ్రుమ్ముచుఁ గోర్కి జేపుచుం
గోపము లేకయే కసరి కొట్టుచు "నొచ్చితి" వంచు వింతలం
జూపుచు ముద్దుపెట్టుచును సొంపుగ నన్మొగ మెత్తిచూచు నీ
చూపుల కీయఁగా వలదె? సొలెడు పద్యము లంబుజాననా. 49

చ. సముఖముఁ జేరవచ్చి బిగిచన్నులఁగ్రుచ్చి కవుంగిలించి ప్రా
యముతమిఁజూపుచుం దమలపాకుల చిల్కలు నోటఁబెట్టుచు
దమకముమీఱ నన్నుపరతమ్మున సొలఁగఁజేయునట్టి భ
ద్రముగల నాఁటిరోజు లిఁక రావిఁక రావిఁక రావు నెచ్చెలీ! 50

చ. రకముగ నన్నుఁ గూడుటకు రాతిరివెన్నెలవేళ రాఁగ, మె
చ్చి కవుఁగిలించి "నీవెవరొ? చెప్పుము నాయికలం" దటన్నఁ జె
ప్పక నగుఁజా టటంచుఁ బొరపాటున మెల్లనఁ "జందిరికాభిసా
రిక" ననిపల్కు నీ వచనరీతులు నా మది నుండకుండునే. 51

ఉ. 'పావనకీర్తి యీతఁ' డని పండితులెల్ల నుతించి కొల్వఁగా
భూవలయమ్మునన్ యశముఁ బొందుచు నుండెడి నాకు నయ్యయో!
నీవగలే సదా మదిని నిల్పి భజించుట లబ్బె నెచ్చెలీ!
దైవము వ్రాయువ్రాఁతలవి తప్పవుగా భువి నెంతవారికిన్. 52

చ. సొగసులదొంతియైన యల సుందరి చెయ్వు లవెంత మూర్ఖుఁడుం
బొగడఁగ రాని వంచనఁడు; పున్నెము లేనిదినమ్ములన్ స్మృతిం

దగులఁగఁజేసి నాకుఁ బరితాపము హెచ్చఁగఁ జేసి నీవునుం
బొగిలిన నేమియౌ ? మఱచిపోయి సుఖమ్ముగ నుండు చిత్తమా. 53

ఉ. రాతిరి కొంత నిద్ర గదురంగనె దూరమునందు నున్న యా
నాతినిఁ జూడఁబోయి యట నాలుగుజాములు నుండి యిప్డుగా
చేతమ! వచ్చితీ; విటులఁ జేసిన నిన్నిఁక నేమి సేసినం
బాతక మున్నదే! యిటుల భామల మాయలఁ జిక్కవచ్చునే ? 54

సీ. "స్త్రీలఁ గూడినఁ జేటు చేకూఱు" నని సదా
పలుకు నే నాబాలఁ గలయనేల ?
కలసిన నేమి, 'లోకులు విన్న మర్యాద
లకు భంగ' మని భీతిలంగ నేల ?
భీతిల్ల నేమి, యాభీతభీతమృగాక్షి
నట డించి యచ్చోటి కరుగనేల ?
అరిగిన నేమి, యాయంగన కౌకసీటి
బొట్టు డించక యిట్లు పొక్కనేల ?
తే. గీ. గతజలమ్మున కీయానక ట్టదేల ?
యెట్టినేర్పులు గలిగిన దిట్టయైనఁ
బరులకును బుద్ధులను జెప్పవచ్చుఁ గాని
యాత్మకైనప్పు డాబుద్ధు లడుగువట్టు. 55

చ. కలిమి చెడంగనిమ్ము, కులకామినిదిట్టినఁ దిట్టనిమ్ము, నిం
దలు గలుగంగనిమ్ము, తలిదండ్రులు గుందినఁ గుందనిమ్ము, సం
కెలలు పడంగనిమ్ము, తనకీర్తికి భంగము గల్గనిమ్ము, దాఁ
గలసినకాంతఁ బాయు టది కష్టము కష్టము కష్ట మక్కటా ! 56

ఉ. మారకళావిశేషముల మర్మములెల్లఁ బఠించి, లక్ష్యముల్
నేరుచు టెట్లొకో యనుచు నేను విచారణ సేయుచుండఁగా
నా రమణీలలామ తనయంతనె తాఁగరుణించి నేర్పఁగా
నేరిచినాఁడ; దాని విడనేర్తునె ? నేర్చిన దైవ మోర్చునే ! 57

క. అని యీగతి మోహాబ్ధిని
మునిఁగి మనోరథరథమ్ముఁ బూని చుఱఁచు వే
గ నిజావాసముఁ జేరెను
మనోరథము నిలుపఁదగిన మానిసి గలఁడే? 58

వ. అట్లు వచ్చినపిమ్మట.

ఉ. అక్కమలాక్షి యాతఁడును నగ్గలమై తనరాగు పేర్మి పెం
పెక్కఁగఁ గొంతకాలము యథేష్టసుఖమ్ములఁ దేలుచుండఁగా
నొక్కెడ నత్తలోదరియు నొక్క యయోగ్యతఁ జేసెఁ; గంటకిన్
మెక్కుచు వెంద్రుకల్ వెదుక మేకానుచోఁ గఱ వానె యేరికిన్? 60

తే. గీ. రాజరాజైన నెంతటి రసికుఁడైన
నెంత గారా మొనంగిన నెంత ధన మొ
సంగినను జాటున నొనర్చు దొంగసంగ
తుల నొనర్పక మాన దీ తులువజాతి. 61

వ. ఇట్లిబ్బాల తన వృత్తివైఖరిం బ్రవర్తింపుచుంటయు. 62

క. ఎఱుఁగక యాతం డెప్పటి
కరణిన్ వర్తింపుచుండెఁ గామవశుండై;
ధర గణికాంగన లొనరుచు
దురుపాయము లేరికైన దుర్జ్ఞేయంబుల్. 63

వ. ఇట్లున్నంత.

క. అమ్మధుసూదను కష్ట సు
ఖమ్ములకు సమవర్తిసక్తిగల గుణవంతుం
డమ్మగువదైన వృత్తాం
తమ్మంతయు నెఱిఁగి యిట్లు తలపోసె మదిన్. 65

తే. గీ. ఎన్నివిధములఁ జెప్పిన నితఁడు మున్ను
వినక తుద కాచరించె నవ్వేలఁది పొందు;
ఆచరించుట కేమి, 'యయ్యాతివమిన్న
కన్న గుణవతి' లేదంచుఁ గళవళించు.

ఉ. 'అందమునందుఁ గాని మరియాదలపట్టునఁగాని నేమపుం
బందమునందుఁగాని వెలచానలలోనన కాదు, దీనికే
చందనగంధులున్ సవతు సల్పఁగ రా' రని యూరుచుండు; రో
సుందరులం దగుల్కొనిన సోమరులన్ మఱలింపశక్యమే ? 67

తే. గీ. అయిన నిద్దాని యవగుణం బతనితోడఁ
జెప్పి విడఁదీతుఁ గాక యచ్చెలియ పొందు;
పత్నితో భర్తనెడఁబాపఁ బాప మండ్రు
కాని వెలయాలి నెడఁబాపఁ గలుషమనరు. 68

వ. అని నిశ్చయించి యమ్మధుసూదనుకడ కేతెంచి తత్కాలసముచితాలాప
మ్ముల గాలమ్ముగడపుచు నబ్బాల దుశ్శీలంబు సకృత్ప్రసంబుగాఁ
జెప్పి యొప్పించి మఱియును. 69

ఉ. మాయలమారులైన వెలమానిను లెక్కడ ! నేమపుంగతుల్
వాయకయుండు టెక్కడ ! ప్రపంచమునం దెటువంటివారలున్
రోయక యుందురే ! కడలుద్రొక్కిన దెట్టిలతాంగియైన దు
ర్జేయము లీధనాంగనల చిత్తము లిందు భ్రమింప రుత్తముల్. 70

క. ఇంతకుమును మీతోడన్
మంతనమునఁ జెప్పినట్టి మాటలలో నొ
క్కింతయు నయథార్థముగా
కంతయు నిజమాయెఁగా యటంచు బలికినన్. 71

క. ఆతఁడు సెప్పిన మాటలు
చేతమ్మున కెక్కి దాని చేష్టలయందుం
బ్రీతి నెడి తనదు ప్రీతిన ని
రాతంకముగా నొనర్ప నాత్మగతమునన్. 72

మ. గొనములున్నన్, హాళక్కి సత్య మహహా ! కుర్మల్ప భఃపుష్పముల్
మనముల్ సూడ శతావధానకృతులే, మానమ్ము కుందేటి కొ
మ్మని నీ వెల్లనెఱింగి వారసతి నాహా ! యెట్లు వాంఛించెదే !
మనమా ! వద్దిఁక నాదుమాటవినుమా, మర్యాదఁ గాపాడుమా ! 73

మ. 'ఘనసారీమణులెల్లఁ దుచ్ఛమతులే తథ్యమ్ముగాఁజూడ నే
ఘనసారీమణిమాత్రి మొక్కటె మహాధన్యాత్మ కాఁబట్టి దీ
నిని వర్జింపుటకూడ' దంటి విపుడేనిన్ గూడునా, కూడదా ?
మనసా : వద్దిఁక నాదుమాటవినుమా ! మర్యాదఁగాపాడుమా ! 74

క. ఈగతి దృఢనిశ్చయుఁడై
యాగరితకు వ్రాసెనిట్లు "లకటా ! యశమున్
బోఁగొట్టికొంటి నీయను
రాగము నిజమని తలంచి రమణీమణిరో". 75

క. చెలికాఁ డాడిన పలుకులఁ
గల యర్థం బెఱుఁగలేక కలికిరో ! నీవ
ల్కులె వేదము లని మురిసిన
కలుషాత్మున కిట్టిఫలముఁ గలుగక యున్నే. 76

ఉ. నిన్ననసేల : నీదు కులనీతి నెఱింగినవాఁడనయ్యుఁ బే
రెన్నికఁ గన్న సద్యశము నెంచక చంచలమానసుండనై
వన్నెయు వాసియుఁ రుచిరవర్తనముం జెడఁగొట్టుకొంటి నా
కన్నను మూర్ఖుఁ డింకొకఁడు గానఁగరాఁ డిఁక వేయునేటికిన్. 77

చ. వలపు నిజంబటంచు మగువా ! మది నమ్మితిఁ గాని యిన్ని మా
యలు గలదాన వం చెఱుఁగనైతిఁ గటా ! సరివారలందు నౌ
దలయును వంచుకోవలసెఁ దన్వి ! వ్రతంబు చెడెన్ సుఖమ్మునుం
గలుగకపోయె నిట్లగునుగా ! వెలకాంతలతోడి కూటముల్. 78

ఉ. ఓవనజాక్షి ! నీదు కులయోగ్యత లెల్ల నెఱింగి నీపయిన్
భావము నిల్పి పండితులఁ బామరులుం గడఁగేలి సేయఁగా
దే ! విధిచోదితుండనయి తేలిక కేలికనైతి; నేరికిం
గేవల కాలకర్మ గతికిం బ్రతికూల మొనర్పఁ జెల్లునే ! 79

సీ. పుట్టినాఁడనుకదా ! భువనప్రసిద్ధమౌ
వైష్ణవకులమందు వనజనయన !

చదివినాఁడనుకదా ! సకలవిద్యలను స
జ్జనులెల్ల మెచ్చంగఁ జంద్రవదన !
తిరిగినాఁడనుకదా ! పరదేశములను వి
ద్యాప్రసంగములకై తలిరుఁబోఁడి!
పొందినాఁడనుకదా ! భూమిలో నీపాటి
వాఁడు లేఁడనుకీర్తి పద్మగంధి !

తే. గీ. అట్టి నాబోఁటి నీబోఁటిదైనయొక్క
కాంత కాసించుటే యొక కాని మాట;
దానిలోన రసాభాసదశయుఁ గూడఁ
గలిగెనేనియుఁ జెప్పనా ! కలికి ! సుఖము. 80

క. ధన మీనో ? మన మీనో ?
చనవీనో ? నీదు జాతిచందము కాకు
న్నను నొకటి తక్కువున్నదె !
పని లేదిఁక నీ గుణంబు బయటం బడియెన్. 81

తే. గీ. కప్పపుంబొడి పంకంబుఁ గలిపి దాని
యందుఁ గస్తూరిగూర్చి దోహదముచేసి
చానిపి పన్నీటితోడఁ బెంచుదురుగాక
యున్నవాసన వాయునే ? యుల్లిగడ్డ. 82

తే. గీ. గతజలమ్మున కిఁక నానకట్టగట్ట
నేమియగు ? నీకు నాకును ఋణముదీఱె;
మంచిపనిఁ జేసితివి, నాదుమాట కేమి,
జగతి కుపకారమగు చర్య సలిపితీవు. 83

వెలచెలులన్ వివేకులగు పెద్దలు పెండ్లికిఁ బిల్వరాదు; వా
రలు గల పెండ్లికిం జనఁగరాదు; జనం గనఁబోల దాటపా
టల; నదిగాక విద్యలఁ గడంగి వచింపఁగ రాదు; దీనికిన్
బొలసినవారికెల్ల మధుసూదను దుర్గతి రాక తీఱునే ? 84

తే. గీ. అనుచు నెఱుఁగంగ నేర్చినయట్టివారి
కెల్ల నెఱుఁగంగఁ జేసితి విందువదన!
యెఱుఁగ నేరనియట్టి సోమరుల కీవ
కాదు బ్రహ్మయు బోధింపఁగాఁ గలఁడె! 85

క. నాకొక్కని కపకారము
చేకొని యొనరించి తంచు సిగ్గిలఁ దరుణీ!
లోకోపకారకంబగు
నీకృతికిన్ మెచ్చవలదె! నేర్పరు లెందున్." 86

క. అని కమ్మ వ్రాసి పిదపం
దనయంతన విడిచె దానిఁ దగ నమ్మధుసూ
దనుఁడు; మనము విఱిగినచో
వనితామణు లన్న గడ్డిపరకలు గారే? 87

క. వాసవునకైన ధనకాం
తాసంగతి వలదు, దానితత్త్వమ్ము రసా
భాసము నిక్కము; సుగుణ
వ్యాసంగులు దాని బారిఁ బడరెప్పట్లన్. 88

మ. అతఁ డీరీతిఁ బరిత్యజించుటయు నయ్యబ్జాక్షియుం గొంతఁ దా
మతిఁ జింతించి క్రమమ్ముగా నతని ప్రేమ న్మాని పెన్మాయలాఁ
డితనం బూని స్వవృత్తి నెల్ల విటగోష్ఠిం జెంది పెంపొందె నౌ!
"గతిలేనమ్మకు గంజి పానక" మనంగా నిక్కమౌనే కదా! 89

సీ. తలిదండ్రు లింటిపెత్తన మొకించుక లోటు
జరుగకుండెడిరీతిఁ జక్కఁబెట్టి
యనుకూల మగులీవిఁ దనకొంత తనకెంత
యును వన్నె వాసి నార్జనము సేయ
నతిభక్తి గలశిష్యతతు లెల్లవేళలఁ
దను గొల్చి బుద్ధిమత్తను భజింప

లక్ష్మిసరస్వతుల్ దమ పరస్పరవైర
ములవీడి తనగృహమ్మున వసింప
తే. గీ. బాంధవశ్రేణులెల్ల సెబా సనంగ
సకలదిగ్దేశరాజన్యసభలయందుఁ
దనయశమ్ము నిరంకుశత్వము వహింప
సుఖముగా నుండె నమ్మధుసూదనుండు. 90

క. సతతపరిశ్రుతభూదై
వతమృష్టాన్న ప్రదానవర్ధిత కీర్త్యం
చితతాదృశజనకయశో
వితతీ ! తతజగదతీతవితరణసుకృతీ! 91

మ. పరిపూర్ణాయురపారభాగ్యవిలసద్భావాంచితా ! కీర్తిసం
భరితాశాంతర ! సత్కవిత్వకుకవిత్వస్ఫూర్తినిర్భేదత
త్త్వరహస్యప్రథమానబుద్ధిబలసంతానాధికా ! నిత్యస
త్యరతా ! చెల్మయమంత్రిపుత్ర ! కవిరాడ్దారిద్ర్యవిచ్ఛేదరా ! 92

క. నానాఫలపుష్పాగని
దానోద్యానాంతరస్థితసుసౌధతలా
మానబుధసుకవిమిత్రవి
తాన వినోదావధాన ! దాననిదానా ! 93

— గద్య —

ఇది శ్రీ....కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వతీ శతావధాని శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బయిన కేవలకల్పితం బగు శ్రవణానందం బను మహా
ప్రబంధమ్మునందు సర్వంబును పంచమాశ్వాసము
సంపూర్ణము.

తే. గీ. దేశదేశమ్ములకుఁబోయి తిరిపమెత్తి
యార్జనముచేసికొన్న ద్రవ్యమ్ముకొంత
'ఆరుబతునాటు' హరియించెనౌర! వీరి
క్షౌరమున కీడువచ్చెడి క్షౌర మున్నె!

—• గర్వముగలవాఁడు గాడిద. (మత్తకోకిల) •—

మానవుం డెవఁడేనియుం దనమానసమ్మున గర్వమున్
బూనినం దన కెంతతెల్వియుఁ బొల్పు గెల్పును గల్గినం
గాని వానిని గాడ్దెయం చనఁగావలె న్మదిఁగొంక కే
వానికైనను గర్వమన్నది వంచనన్ ఘటియింపదే.

—• ద్రౌపదీకృష్ణానద్యోశ్శ్లేషః. (మణిమాలా) •—

సద్వర్తనశీలాం సాధ్వీ మమలాంగీం
నీరేరుహవక్త్రాం హంసేంద్రగతిం తాం
కోకస్తనభారాం కూర్మప్రపదాం శ్రీ
కృష్ణాం కమలాభాం మనుతే కిల కృష్ణా.

—• ద్వైతమతము. (మత్తకోకిల) •—

జీవుఁడున్ మఱి యాత్మయున్ వెసఁజేరుటన్న హుళిక్కి యా
దేవుఁ డుండెడిచోటికిన్ దమదేహమే చను దివ్యమై
యీ వసుంధర యెల్ల నిత్య మనేకు లుందురు జీవు లీ
త్రోవ ద్వైతమతమ్మనం గలతోరివ పండితమాన్యమున్.

—• వి దూ ష కః (స్రగ్ధరా) •—

స్రగ్ధారీ దండధారీ వివిధవసనయుక్పోళధారీ వికారీ
సంచారీ హాస్యకారీ కుటిలతరవచో భాష్యకారానుకారీ
దూరీభూతోచితోక్తి ర్వినయవిరహితో నామధారి ద్విజాతీ
రాజ్ఞా మత్యంతమిత్రం రహసి విజయతే దూషకోయం విపూర్వః.

—• రా జ ద్రో హ ము •—

చ. క్రమముగ నాఁడునాఁటికిని గవ్వకునేనియుఁ జేయి సాచు, రా
జ్యమునకు హానిఁజేయుఁ, గడునద్భుతగోప్యకృతుల్ పొనర్చు, ను

## —• ఆ శీ ర్వ చ న ము •—

ోతనవంటి పుట్టు కవి - పుట్టి పెరింగినసీమ దాతృతా
్యాతికి నాలయంబు - విజయంబు గురూత్తమ పాదభక్తికిన్
ేత మహమ్మదీయుఁడు - మనీషుల గౌరవమున్నచోటు - ద్దు
ాతులు త్రొక్కరానిది "నిజాము" పరిభూత్తము - రాజ్యమారయన్.

క. సరిహద్దు సీమలకుఁ బోరిఁ
బోరిన్ గలువువచ్చు నల్లపుడు "నైజాం" దు
ర్భర పీడా పరిభూతిన్
మొఱకులకున్ లోగదెట్టి ముత్తైదువయో !

తే. గీ. అనఘుఁడగు రామదాసు భద్రాద్రియందు
రాము నెలకొల్పియెచట నేరామునకును
లేనివైభవమును దన మేనిడి ఘటి
యించు - కీరితి యెపుడు రహించుఁగాక !

క. కులగిరులు కుంగిపోయిన
నల భద్రాచలము చిన్నదయ్యు రహించున్
కల భక్తకోటిఁ బ్రోచుచుఁ
దలపై రామాలయమును దనరెడి నల్లే

క. "నైజాము" మండలమునకు
రాజగు "నుస్మానియాకు" రాజిల్లుత ! స
త్తేజం బాయుర్వృద్ధియు
శ్రీ జాని యనుగ్రహమున సిరియునితోఁపిన్.

క. కలవాని గొలుచు భూపతి
కలవాఁడై యెసఁగువాఁ డఖండుం డాఖం
డల తుల్యుఁడో ? పైవాఁడో ?
కలవాఁడై సర్వధా ప్రకాశిలుఁగాతన్ !

తే. గీ. ఓ తెలంగాణమా ! నీకు నున్నతదశ
పట్టనున్నది - పట్టిన దిట్టియోగ
మతిగోచరమై - వ్యర్థమగుటలేదు
వృద్ధిఁజెందుము సర్వథా విస్తరిలుచు.

—• విశాలాంధ్రి అవతరణ •—

నేడు విశాలాంధ్రి అవతరణమహోత్సవం ప్రారంభమవుతున్నందుకు చాలా ఆనందపడుతున్నాను. చారిత్రికంగా ఆంధ్రుల మహోన్నత దశలు గుర్తునకు వచ్చినప్పుడు అస్వాతంత్ర్యపుటనైకమత్యపు పరిస్థితులు హృదయవిదారకంగా తోచకమానవు. "శతాంధాఃకూపంప్రవిశంతి" గా నాయకత్వం వహించేవారి ఆజ్ఞలు ప్రజానీకానికి శిరోధార్యాలైతేనే కార్యసాఫల్యం ఏర్పడుతుంది. అట్టి శక్తికి విశాలాంధ్రి నిర్మాణం-నాందియై క్రమంగా శుభోదయంగా పరిణమించుగాక!

వచ్చినట్లేవచ్చి-అంతలో మఱికొంతకాలంపాటు స్వరూప ప్రదర్శనకెందుకో సిగ్గుపడుతున్న—అంధ్రికూడ సర్వావయవభూషితురాలై, వచ్చుటకిది మార్గదర్శియగుగాక !

గాంధీమహాత్ముని యేకైకనాయకత్వంలో భారతదాస్యవిమోచనాన్ని సాధించిన కాంగ్రెసుసంస్థయే సర్వవిధాలా నేటివిశాలాంధ్రి మహాసభకు ఆదర్శమగుగాక !

క. శీలమునకు పాలనమున
కాలంబనమగుచు ప్రజలకతిసుఖదంబై
పాలింపంబడుఁగాత! వి
శాలాంధ్రి రహించుఁగాత! జగతీస్థలిలో.

క. ఏలెడివారికి మఱియుఁ
బాలింపంబడెడి ప్రజకు భాగ్యోదయమై
శీలముగల యువతులకువి
శాలాంధ్రరహించుఁగాత! జగతీస్థలిలో.

క. "కాలోహ్యయంనిరవధిః
శీలశ్చతథైవ" యనుచుశీలవతులువి
ద్యాలంబినులలరంగవి
శాలాంధ్రరహించుఁగాతః జగతీస్థలిలో.

క. శ్రీలకుఁదానకమయిజే
జేలకునున్ నైతమంతు చిక్కనిభోగ
శ్రీలున్ భాగ్యశ్రీలువి
శాలాంధ్రిగడించుఁగాతః జగతీస్థలిలో.

ఆ. వె. అవతరించుగాతః మానాటియుత్కృష్ట
దశలు తెనుఁగు వారి ధైర్యమందు
కార్యదీక్షలోని శౌర్యమ్ముగవగూడి
ప్రభుత యుద్ధరింపఁబడునుగాతః

క. ఒకరినినొవ్వంజేయక
యొకరిపయిన్ బక్షపాతముంచక శాంతిన్
బ్రకటించుచు స్వాతంత్ర్యము
నకు యత్నించుటకు బూనినన్ శుభములగున్.

గీ. ఒకప్రజారాజ్యమున మనముంటిమిప్పు
డనినపాలకులము మనమైతిమన్న
మాట-కావునమనలోన మనమెరాష్ట్రి
మును జెలిమితో విభాగించుకొనుటలెస్స.

గీ. అదివిశాలాంధ్రిగా బుట్టువందుకొఱకు
నాటుచున్నాము నేడు పునాదులిచట
వీనిపైమేటిసౌధముల్వెలసి తెనుఁగు
వారికి సుభిక్షమున్ గూర్చిప్రబలుఁగాత.

క. సరిహద్దులేరు పాటగు
వరుసనునైజాముతెనుఁగు భాగముమనలో

స్థిరమౌఁగావుత! మెప్పటి
కరమరికలులేని స్నేహమభివృద్ధిగొనన్.

ఇట్లే యావద్భారతమున్న భాషాప్రయుక్తరాష్ట్రవిభజన సిద్ధాంతాను సారంగా విభాగింపఁబడుటతో సుఖశాంతులు సంపదలు అభివృద్ధియై రత్న గర్భయను పేరు సార్థకమౌగాత! మనియాశీర్వచించుచున్నాను.

—• ఉగాది సందేశము •—

చ. అవని ''నవోనవోభవతి'' యంచు సమస్తము శోభఁగాంచి యెం
దు విలసనమ్ములన్ నవవినోదములన్ బ్రజలార్ద్రచిత్తులై
సవనములన్ బొనర్చి దివిషద్గణముఁ బరితృప్తిగాంచున
ట్లు వివిధమార్గముల్ నెఱపి లోకము సౌఖ్యకరం బొనర్చుతన్!

సీ. ఎన్నియోయిప్పంటి కేగియుండెయుగాదు
లీయుగాదిని బోలవేవిగూడ
మనతాతముత్తాతలును వారిముత్తాత
లెఱుఁగరిట్టియుగాది నెపుడుగూడ
స్వపదంబునెవరు రాజ్యపదంబుతోఁగూర్చి
పలుకరు-వినరొరుల్ పలికిరేని
వినరును; పలికినఘనులను వారి-తు
రది పెద్ద తప్పని-యఘమనియును

గీ. అట్టిభారతీయులునేఁ టికాత్మరాజ్య
పాలనంబన నెట్టిదో ప్రతిభమెఱయ
నేలుచున్నార లంతలో నెసకమెసఁగ
వచ్చినది యీయుగాది సంవత్సరాది.

సీ. ఓపికఁ బట్టి మాయోగమ్ము క్షేమమ్ముఁ
గాంచవచ్చితివే? ఉగాదితల్లి!
ఎన్నాళ్ళకెన్నాళ్ళకీక్షించితిమి విన్న
వత్తువటంచు నెవ్వరును దెలుప

# * ముఖ్యమైన సవరణలు *

## నానారాజసందర్శనము

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 19 | యామ | యాగమ |
| 11 | 21 | మూన | సూన |
| 35 | 2 | డుఃకట్లుంనే | కట్లుండునేః |
| 40 | 22 | మహా | మహో |
| 74 | 1 | యటి | యట్టి |
| 74 | 25 | రాకృ | రాపకృ |
| 79 | 2 | తుల్ | తులు |
| 79 | 2 | తులు | తుల్ |
| 79 | 17 | శోఁక | స్తోఁక |
| 80 | 2 | గాంద | గాంచ |
| 89 | 26 | చిన్న | చిన్ని |
| 91 | 2 | మున్నై | మొన్నై |
| 96 | 21 | చందాఱి | చందఱి |
| 105 | 4 | లశలన్ | ల్దిశలన్ |
| 118 | 22 | మ్యద్దు | మ్మద్దు |
| 121 | 25 | దిద | దిద్ద |
| 131 | 3 | దైతా | ద్వైతా |
| 131 | 5 | భు_ం | భుక్తిం |
| 133 | 22 | మిత్వే | మిత్యే |
| 140 | 21 | ర్మముల్ | ర్మమ్ముల్ |
| 155 | 6 | వయల | ట్టినయల |
| 173 | 11 | పింపు | పించు |
| 174 | 24 | మెచ్చె | వచ్చె |
| 178 | 17 | ద్భుమై | ద్భువమై |

# శతావధానసారము

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 15 | లోల | లోన |
| 60 | 18 | డ్డిడ్లు | డ్డిండ్లు |
| 69 | 6 | ధితా | ధిగతా |
| 69 | 23 | పసంత | వసంత |
| 87 | 7 | య్యావి | య్యాడి |
| 97 | 21 | శ్రీ | శీ |
| 105 | 17 | వ్యమె | వ్యమై |
| 106 | 17 | నంత | సంత |
| 107 | 6 | ధధా | దధా |
| 111 | 14 | ఖిశా | ఖిసా |
| 149 | 18 | షభా | షసభా |
| 149 | 23 | విధీధిత | విదధీత |
| 150 | 1 | బల | జల |

# కలగూరగంప

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 92 | 15 | పెరే | పేరే |
| 99 | 9 | పఁద | పంద |
| 100 | 22 | న్నాఁదు | న్నాఁడు |
| 100 | 24 | నేఁగుఁ | నీఁగుఁ |
| 112 | 7 | నెట్టు | నెట్టి |
| 112 | 11 | వేనా | వేవా |
| 142 | 26 | యిచ్చి | యిచ్చు |